THE

# Paduka Pattabhishekam

## (THE EXILE OF RAMA)

A TELUGU DRAMA IN FIVE ACTS


COMPOSED BY THE LATE

D. KRISTNAMA CHARLU,

**"Andhra Nataka Pithamaha,"**

*First Grade Pleader, Bellary.*


FIRST EDITION.


PUBLISHED BY

D. K. Krishnama Charlu and his Brothers.

Madras:

PRINTED BY MESSRS. S. MURTHY AND CO.,
AT THE "KAPALEE" PRESS,
305, THUMBU CHETTY STREET.

1914




**[Price—Rupee One.]**

శ్రీ

# రామపాదుకా పట్టాభిషేక నాటకము.

ఇది

బళ్లారిలోనుండిన డిస్ట్రిక్టుకోర్టువకీలు

"ఆంధ్రనాటకపితామహ" యను బిఱుదువహించిన

## ధర్మవరం - రామ కృష్ణమాచార్యుల చేత

రచియింపఁబడినది.

మొదటి కూర్పు.

881

డి. కె. కృష్ణమాచార్లు, వారిసహోదరులవల్ల ప్రకటింపబడియె.

చెన్నపురి:

యస్. మూర్తి అన్డ్ కంపెనీవారి

కపాలి ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

1914



[క్రయము రూ. 1—0—0.]



**Bellary, D. KRISHNAMA CHARLU,**

**ANDHRA NATAKA PITHAMAHA,**

*Born 1853 — Died 1912.*

శ్రీ

# సావిత్రీ చిత్రాశ్వ

# పాదుకా పట్టాభిషేక నాటకములు.

---

## మొదటికూర్పు—పీఠిక.

త్రిలింగమున నాటకరచనాధౌరేయుఁడై కావ్యపఠనాభియుక్తులకును నాటకఖేలాదిదృక్షువులకును విమలామోదసంధాయకుఁడై యాంధ్రనాటకపితామహాభిఖ్యఁజెలంగి దాదాపునఁ బురుషాంతరకాలంబు రంగంబున జనాంతరంగంబుల రంజిలఁజేయుచు బళ్లారిపురమున రాజకీయ కార్యస్థానంబులఁగొఱలు న్యాయవాదుల మిన్నగ నెన్నికఁ గన్న మహనీయుఁడు ధర్మవరము రామకృష్ణకవి నేఁటికిఁబదునైదు మాసములక్రిందటఁ బరమపదముఁజేరియుంటఁ జదువరులెల్లరు నెఱిఁగియేయుందురు.

ఈకవిజీవితం బాంధ్రదేశభాషాభిమానులెఱుంగనగు. కావున వానినిందు సంక్షిప్తముగఁ దెల్పెద. ఇతని పూర్వులు భిషగ్గ్రంథల ప్రభాకరులనఁజెన్నొంది గౌరవసమృద్ధినిమని మూఁడుజిల్లాలలో గొప్పమర్యాదలఁ బడసినవారు. తలిదండ్రులకుఁగలిగిన యెనమండ్రు బిడ్డలలో నితఁడె జ్యేష్ఠుఁడు. ఇతనితోఁబుట్టువులలో నిప్పుడొక చెలియలును ముగ్వురు తమ్ములునున్నవారు. పుత్రశోకభర్తృవియోగక్లేశంబున

జననీభార్యలు కీడ్పడి కర్మానుసారలబ్ధ శరీరయాత్రఁ జరుపుచున్నారు ఇతనికి పుత్రులార్గురును పుత్రికలు ముగ్వురునున్నారు.

ఇతఁడు 1853-సంవత్సరమున బళ్లారి పురమున నుదయించె. ఇతని ధిషణామహిమ చిన్నతనమునుండియుఁ జూపఱుల కాశ్చర్యముఁ గలిగించుచుండె. ఏఁడాదియీడుకుమున్నె మాటలాడఁదొడఁగి పాదరక్షలఁదొడుగుచుండె. మూడవయేఁటనే యమరకోశమున మూఁడు కాండములితనికి ముఖస్థమైయుండె. ఆఱవయేఁటఁ బ్రతాపరుద్రీయాది సంస్కృతకావ్యములఁ జదివియుండె-ఇతనికి తెనుఁగుభాషయందభిరుచిమెండు. చిఱుతవయసుననే పెక్కుకావ్యముల పరిచయమందినవాఁడు. 1874 సం॥న **F. A.** పరీక్షను, న్యాయవాద పరీక్షనుఁ గృతార్థుఁడయ్యె. ఇతని జ్ఞాపకశక్తియద్భుతము-చిన్నతనముననే శతావధానశక్తిగల్గియుండె. అయ్యది మిత్రవర్గమున కత్యంతానందదాయకముగనుండె. 1876 సంవత్సరాంతమువఱకు నతనికి సంస్కృతాంగ్లేయనాటకవ్యాసంగములావుగనుండె. అంతఁబితృదారాపరజావియోగక్లేశంబులొకటిపైనొకటి పఱచియతని నొక్కవత్సరము మిక్కిలి నొగిల్చె. ఇతనివాదమహిమయుఁ బ్రత్యర్థిబోధితసాక్ష్యము వెలిపుచ్చుసామర్థ్యంబమోఘంబు.

ఇవియిట్లుండ నితనికింగల నాటకాభిష్వంగమునకుం దోడుగఁ దద్రచనాభిలాష ప్రేరణమున కొండుకారణముగలిగె. 1886-సం॥న మైసూరినుండి యొకనాటకసభ బళ్లారిపురమునకేతెంచి కర్ణాటకనాటకముల ఖేలనమొనర్చుచుండె. అత్తఱి యాయూరిలో నూతనముగ నుద్భవిల్లియున్న యొకనాటక సమాజమువారుఁగూడఁ దత్తఱంబునఁ గర్ణాటకభాష నొకనాటకముఁ బ్రదర్శించిరి కాని యది నీరసమై రుచియింపదయ్యె. ఊరివారే వారిసాహసాది విశేషముల నుగ్గడించుచు హేళనము

మాని కవిచే రచియింపఁబడిన బాటలుమాత్ర మంగీకరింప వారివేఁడెద నేనొక్కకవియనిడంబుఁదాల్పి నీయుద్యమముఁ బూనినవాఁడఁగాను. ఈకవి నాకు నగ్రజుండౌటఁబట్టి యతనియెడ నాకుఁగల పితృభావము నెఱప వేఱుదారిదోఁపమిచే నెవ్వరేమనుకొన్న నిష్టదేవతఁబూజించు కైవడి నాశక్తికొలఁదిఁ బద్యములఁగూర్చి యతనికర్పించినాఁడ. అందు దోషాలోపంబు లెన్నియోయుండనోపు. సుధీజనులు వానిసరకుగొనక దోషానిరసన గుణగ్రహణమతి నను మన్నింపఁదగు.

ఈకవి రచియించిన మిగిలిన నాటకములుమాత్రమున్నవి యున్నట్లచ్చొత్తింపఁబడునని విన్నవించువాఁడను.

ఉ॥ అవ్యయలీలహృద్యవచనామృత సాంద్రధునీభృతాంధ్రభా ।
షావ్యవసాయమూనిరససంభృత సస్యములోజఁబెంపఁదా ।
స్తవ్యవిచిత్రకల్పితకథానవదోహదమేర్చి ధీరసం ।
సేవ్యుఁడు రామకృష్ణకవిమేమెయిఁగావ్యము లూడ్చె వేద్యుఁడై.

చెన్నపురి.
14-3-14.

బుధజనవిధేయుఁడు.
ధర్మవరము శేషాచార్యుఁడు.

సేయఁదొడఁగిరి. అందుపై తామున్న మధ్యదేశంబునకే యపయశం
బొడఁగూడినభంగి మిడుకుచు మిత్రకోటి యీకవినిఁ గర్ణాటకభాషను
నాటకముల రచియింపఁబురికొల్పిరి. వారియుద్యమమునకుఁ జేకుఱిన
పరిణామంబీకవియే తారచియించిన చిత్రనళీయనాటకపు మొదటికూ
ర్పున పీఠికయందు సవిస్తరముగఁ దెలిపియున్నవాఁడు. నాటంగోతె
నిక్కవి పెక్కునాటకములఁ దెనుఁగున రచియించె. సరసవినోదినీ సభ
వారు వానిలోఁ గొన్నిదక్కఁదక్కినవి రంగమునఁ బ్రదర్శింపుచువచ్చిరి.
1912-సంవత్సర ప్రారంభమునఁ గొన్నికారణములఁబట్టి యీకవి తాఁ
గట్టిపెంచిన యాసభనుజ్జగించి "యభినవ రసవినోదినీ" నామమున
వేఱొండుసభ నిర్మించె. తొంటిసభ కాలాంతరమున నీ యభినవసభ
నైక్యముగా నోపునని యెంచియో లేక తాగడించిన యా సభానామము
పైఁ బ్రేమమువీడఁజాలకయో తొంటిపేరే రెండవసభకునిడె. ఈ సభ
యొక్కకళయే యీకవియాధ్యక్షంబునఁబెఱిగి యతనియనంతరంబునఁ
"కృష్ణమాచార్యులసభా" ఖ్యఁ నేటికిఁబఱగుచున్నయది.

ఇతఁడు 1912 సం॥న నవంబరునెల 30-తేదినిఁ గార్యార్థమై ఆ
లూరు గ్రామమునకుఁబోయియుం డినాఁడు సాయంతనముననచటి స్నా
యస్థానాగారంబున ప్రమాదవశంబునఁ గాలుజాఱి పఱపుఱా[illegible]లఁబడి
మృతుఁడయ్యె. ఆంధ్రనాటక వైశద్యమునకీకవిపడిన పాటునభినందింపన
నేక గ్రామమ్ముల సభలుగూడె. చెన్నపురి రాజధానియందలి మహా
జనులు గూడనొకసభఁగూర్చియతని జ్ఞాపకార్థమొక శాశ్వతలక్ష్య
ముగడింపఁదీర్మానించిరి. కానియాయుద్యమసాఫల్యంబింకనుభవిష్యం
బెయనఁదగియున్నది. బళ్లారి పురమున మాత్రముపైఁజెప్పిన "కృష్ణ
మాచార్యులసభను" ప్రముఖుఁడైయీకవియొక్క యపరజుండగు
గోపాలాచార్యుఁడొక గొప్పనాటకశాలఁగీర్తిశేషుఁడైన యగ్రజుఁబేర
నిర్మాణమొనర్చి యున్నవాఁడు.

ఈకవి తారచియించిన నాటకముల నన్నింటి ముద్రింప నెన్నియో మారులుద్యమించెఁ గాని తన జీవితకాలమునఁ "చిత్రనళీయ" "విషాదసారంగధర" ములు దక్క వేఱొండు ప్రచురింపఁజాలఁడాయె. ఈవిషయమై కలిగినయంతరాయములు విషాదసారంగధర నాటకోపోద్ఘాతమున వివరింపఁబడియున్నయవి. ఈ "సావిత్రీచిత్రాశ్వ" నాటకమునందలి రెండంకములుఁగూడ బహుకాలము క్రిందటముద్రితమయ్యుండెఁగాని మూడవయంకమునకు వలయుపద్యములఁగూర్పనీకవి కెంత మాత్రమునందువోడమదయ్యె. "పాదుకాపట్టాభిషేకము" నెట్లోపూర్తిపఱచె. ఆ నాటకము నిపుడే ముద్రితమైయున్నయది.

ఈ "సావిత్రీచిత్రాశ్వ" నాటకమున రెండంకములమాత్రము పద్యములందందు నెలకొని యుండుటయుఁదుది యంకమునఁదుదినున్న సీసపద్యమొక్కటిదక్కఁ బద్యములే లేకుంటచేయది బుచ్చివాఱిన చందంబుదోఁప నాలోపంబుఁ బూరింప నేనొనర్చిన మార్గాంతరమార్గణంబు రిత్తవోయె. అంత నామిత్రులును బంధుగులునుఁగొందఱు నన్నే యీలోపంబుఁదీర్పఁ బ్రోత్సాహపఱచిరి కాని మణిఖచిత స్వర్ణాంగుళీయ కాంతరావసిత కైతవరత్నముభంగి నేఁగూర్చుపద్యములు రసాభాసప్రతిపత్తిఁ జేకూర్చనోపునని జంకితొల్తనియ్యకొననైతి. అయిన నాకు మిక్కిలి యాప్తుఁడును సంస్కృతసాహితి నసదృశప్రవీణుఁడునైన మహాపురుషుఁడొక్కఁడు నన్నీవిషయమునఁ బాటుపడ దిట్టపఱుపనెట్టకేలకొడంబడితిని. కావున నీనాటకమున ద్వితీయాంకాంత్యమున "ఘనశత్రుదుష్కృత్యమున... ..." యను సీసపద్యము మొదలు తృతీయాంకోపాంత్యముననుండు "వనితలంగజయానవ్యాణి..." యను సీసపద్యమువఱకు నెలకొల్పఁబడియుండు పద్యములు నాచేరచియింపఁబడినవిగాఁజదువరు లెఱుంగన్నగు. అయ్యవి నీరసంబులగుచో వాని

శ్రీ

# రామపాదుకా పట్టాభిషేకము.

## నాంద్యంతమున సూత్రధారుఁడు.



సూత్ర—నటీ! ఇటురమ్ము.

[ప్రవేశము: నటి].

నటి—ఆర్య! సెలవేమి?

సూత్ర—చూడు మీయెడ నానా శాస్త్రకోవిదులును, సంగీత సాహిత్య విశారదులు నగు విజ్ఞమండలి చేరియున్నది. వీరిమానసములలరింపగు విధానమున నేదేని నాటకముం బ్రదర్శింతమని యభిలాషవొడమి నీయోచనఁగోరి యాహ్వానమొనర్చితి.

నటి—ఇందుకు నాయాలోచనయేల? ఏదోయొక యాంధ్రనాటకముం బ్రదర్శింపుము.

సూత్ర—ఏదో నాటకమన్న నేమి? భాషావైశద్యమునను, సంవిధాన చమత్కృతివలనను సర్వజనముల మానసముల రంజింపఁదగు నాటకము గదా ప్రదర్శనీయము.

నటి—అయినఁజెప్పుము. పురాణకథయా, కల్పనాకథయా, లేక చరిత్రారూపకమా వీరి సంతోషపెట్టఁజాలినది?

సూత్ర—ఏకథయయిన నేమి? రసస్ఫూర్తి కలిగియుండవలయుఁగదా? కథ యెట్టిదయినను దత్కర్తఁగదా విచారింపవలయు?

నటి—అయిన నాంధ్రనాటక పితామహఖ్యాతిం జెందిన రామకృష్ణ కవీంద్రునాటకమేదైనఁ బ్రదర్శింపఁదగు.

సూత్ర—నాకు నట్లేతోఁచుచున్నది.

నటి—అయిన నే నాటకముం బ్రదర్శింప నెంచితివి?

సూత్ర—ఆహా! జ్ఞాపకమునకువచ్చె. ఆకవీంద్రు డెన్నియోనాటకముల రచియించియున్నాఁడు. అందు విషాదాంతము కాకయుండినను బుధివినున్న యన్ని విషాద నాటకములకును మిన్నయన్న వన్నెఁగన్న చెన్నున మహర్షి పుంగవుండగు వాల్మీకి తనరామాయణమున నయోధ్యాకాండ రచియించియున్నాఁడు. అందలికథయే తత్కవి పుంగవుండు నాటకరూపమున రచియించియున్నాఁడు. దానిం బ్రదర్శింతము.

నటి—ఒకానొకప్పుడు మనము విచారించియుండలేదా యాకథలోని యంశముల? కొన్నివిషయముల సందేహములు తీఱలేదు. భరతుఁడులేనికాలమున దశరథుఁడు రాము పట్టాభిషేకకార్య మేలఁదలపెట్టవలయు? దలపెట్టెఁబో మూఁడుదినముల ప్రయాణమని తెలియవచ్చిన గిరివ్రజపురముననున్న భరత శత్రుఘ్నుల నేల పట్టాభిషేకమునకుఁ బిలువఁబంపలేదు? ఎన్నియేండ్లనుండియో మగనితో సంసారమొనర్చుచున్న కైకేయి యొక మంధర చెప్పినమాత్రముననే రాముపైఁబగఁబట్టవచ్చునా? పోనీ! కైకేయి స్వభావమువలననే పాపకర్మురాలా? లేక మంధరబోధన విశేషమా? మంధరకుఁ గైక మనసుఁద్రిప్పునట్టి కారణములేవియట్టివి చూపించె? కైక వరములడిగెఁగదా? రామునకు రాజ్యమివ్వకుండ నడుగవచ్చుఁగాక యతని నరణ్యమునకుఁ బంపునట్లును, అట్లు పదునాలుగేండ్లును, అందునుఁ దపసివృత్తిపై నుండునట్లును గోరను కారణమేమి? వరములిచ్చినను, భరతునేల తర్వాతనైనఁ బిలపింపలేదు? తుదకు రాముఁడరణ్యమునకుఁ బోయినపిదపనైన భరతునకేల యీవృత్తాంతము చెప్పలేదు? అటు చెప్పనంపియుండిన దశరథుఁడు మృతిఁజెందకమునుపే భరతుఁడేతెంచి రామునిఁబిలుచుకొని వచ్చుచుండెనే. వీనికన్నిటికి సమాధానములందగపడవని యాలోచింపలేదా? అట్టిది నాటకరూపమైన నెట్లలరింపఁగలదు?

సూత్ర—ఏలయోచించెదవు? వీనికన్నిటికిని బ్రత్యుత్తరముల నీవిందు పడయఁగలవు. ప్రొద్దుపోయె. ఇంక నాటకమునకుపక్రమింతము. ఈనాటకమున నీకవి మంగళాచరణముననె మహాకవియగు వాల్మీకిం బ్రస్తుతించియున్నాఁడు. ఆ కవీంద్రునకు సరస్వతి ప్రత్యక్షమనుటకు సందేహములేదు. ఆదికావ్యమన్నను, ఆదిప్రబంధమన్నను, ఆదినాటకమన్నను, తగినది యనిపించుకొను రామాయణము నా మహాకవి రచియించియున్నాఁడు. ఏదీవానికిఁ బ్రత్యక్షముగానున్న యావాగ్దేవి నీవింత ప్రశంసింపుము.

నటి.—(పాటపాడును.)

సూత్ర— రమ్మింకఁ బోవుదము.

(నిష్క్రమింతురు)

---




శ్రీ

# పాదుకా పట్టాభిషేకము.

## పూర్వరంగము.

### ప్రథమప్రకరణము-అయోధ్య-దశరథునాస్థానము.

[ప్రవేశము: దశరథుఁడు, సుమంత్రుఁడు, వశిష్ఠుఁడు, సేవకుఁడు].

వశిష్ఠుఁడు—రాజేంద్రా! దేవేంద్రుఁడు నిన్నొక పనికై యర్థించుచు, తనసారథిని మాతలినిందు పంపియున్నాఁడు.

[ప్రవేశము: మాతలి].

మాతలీ—దశరథ రాజన్యా! విజయోఽస్తు. శంబరాసురుఁడు సురపురిపైదండెత్తి వచ్చుటకు సర్వసన్నాహములు చేయుచున్నాఁడని విని దేవేంద్రుఁడు నను నీయెడకుఁ బంపినాఁడు. ఇక్ష్వాకుకుల సంభవు లెల్లరుఁ దనకుఁ బరమమిత్రులనియు, దానంజేసి నీవునుపరమప్రీతి పాత్రుఁడవనియు నీవు తనకు సహాయముగా రాఁగోరితినని యుఁ జెప్పుమన్నాఁడు. గురుప్రసాదమున శబ్దవేధిసాయకముల పరిచయము నీకలవడి యుండుటచే మాయావితో నీవసంగ్రామముచేయఁ దగుదువనియునన్నాఁడు. ఈవశిష్ఠ ఋషియు నినుఁ బ్రశంసించినాఁడు.

దశ—మాతలీ! నేనాయమరేంద్రుని భృత్య భృత్యుఁడను. రమ్మని యానతిచ్చిన శిరసావహింపుదు. కనదద్రిపక్షవిచ్ఛేద దక్షమై, వృత్రాద్యభ్య మిత్రగాత్రల తాలవిత్రాయ మానమై యున్న వజ్రముగల పాకారికిఁ జేకూడని సంగ్రామమొండుండునా? ననురమ్మన్నుట నాపైఁ బ్రీతివిశేషమ కాక అసత్యమానతి నెఱవేర్చెదను.

క. చిత్రవిధంబునఁ బ్రీతికిఁ
　　బాత్రుఁడఁగాఁడేనిగోత్రపత్రహరునకా
　వృత్రప్రభంజనున కతిఁ
　　మాత్రమె శంబర సురారిమథనంబెందుఁ.

మాతలి—రాజేంద్రా! నీవాడినది నిక్కము. సమరమునిశ్చితమైన వెంటనే వచ్చెదను. పునర్దర్శనమయ్యెడు.

వశి—రాజేంద్రా! నేనును బోవఁదగియున్నది. పోయివచ్చెద.

మాతలి }
వశిష్ఠ } 　　　　(నిష్క్రమింతురు).

దశ—సుమంత్రా! చూచితివే యింద్రుని యనుగ్రహము? నేను శబ్దవేధిసాయకాభ్యాసమునకు సరయూతటంబునకుఁ బోయెద. దానికిఁ దగినట్టు చీకటిరాత్రులును వచ్చియున్నవి. నామోహనాంగి కైకేయి నేనుయుద్ధమాడుట చూడవలయునని యభిలషించినది. అదియు నెఱవేఱఁగలదు. ఇంకఁబోదము.

(నిష్క్రమింతురు).

---

## పూర్వరంగము.

## ద్వితీయప్రకరణము-సరయూతటము.

---

[ప్రవేశము: దశరథుఁడు-ధనుర్బాణధారియై.]

దశరథుఁడు—ఇన్నిదినము లభ్యాసముదప్పినను మఱువలేదుగదా? అప్పుడే నాలుగు గజముల రెండుపులులఁ జంపితి.

(లోపల "బుడబుడ" యనిధ్వని).

ఆహా! మఱియొకగజము జలముద్రావు చప్పిడివినఁబడియె. ఇదెచచ్చెను. (బాణము వేయును.)

(లోపల "హా నారాయణ-హా నారాయణ" అనుధ్వని).

అయ్యో! ఏమిది. హా నారాయణ యనునార్త రావమువినవచ్చె. (పోయిచూచును).

[అక్కడ యజ్ఞదత్తుఁడు. (తాపసపుత్రుఁడు).]

యజ్ఞ—హా! నారాయణ నారాయణ! పండుముదుసళ్ళు నా జననీజనకుల నింకెవ్వరరయువారు?

దశ—హా! శ్రీహరీ!—(మూర్ఛిల్లును).

బ్రా—ఎవరయ్యా యిక్కడ? మరణవేదనమున కోర్వఁజాలకున్నాను. నాయెద నాటిన బాణమునుత్పాటించువార్వరులేరా? మాజననీజనకులొద్దకు నన్నెవరైనఁ గొనిపోరే.

దశ—బ్రాహ్మణోత్తమా! అరయక నీప్రాణమున కెసఁకవెట్టిన దుర్జాతుఁడ నీనే. వలసిన శాప మొసంగుము.

క. పాపాత్ముఁడనై యరయక
యీపాటోదవంగనిన్ను హింసించితినీ
శాపముపాలొనరింపుమ
హాపాపముగలుగఁగాధరామరతనయా.

బ్రా—హా! శ్రీహరీ! శ్రీహరీ! ఈమరణాయాసమున కోర్వఁజాలను. పుణ్యాత్మా! ఈబాణము పెఱుకుము. ఇందేదాపుననున్న మావృద్ధాంధ జననీ జనకులతో—

దశ—అయ్యో! నాయట్టిక్రూరకర్ముఁడుండునే.

బ్రా—అయ్యో! సహింపఁజాలను. మాటలుండనిమ్ము. ఈబాణమునుదీయుము.

దశ—బ్రాహ్మణోత్తమా! ఇప్పుడేశాపమొసంగినన్ను—

బ్రా—అయ్యో! నేఁబ్రాహ్మణుఁడఁగాను. శూద్రియందు వైశ్యునికి జన్మించినాఁడ. నీ పుణ్యమగును. ఈయలుగుఁదీయుము.

దశ—తీసెదను. నీ జననీ జనకుల కేమి చెప్పెదవు?

బ్రా—ఏమిచెప్పఁగలను. అయిన నొకటిమాత్రము చెప్పవలసియున్నది. నిను క్షమింప నేవేడికొంటినని వచింపుము. తీయుమా యీనారాచము.

దశ—(దుఃఖించుచు బాణము పెఱుకును).

బ్రా—హాజననీ! హాజనకా! నారాయణ నారాయణ. (చచ్చును).

దశ— (అనుబంధము. 1.)

కట్టా! నేనెంతక్రూరాత్ముఁడను. ఎంతదుశ్చరితుఁడను. ఈ పాపమున కేదిప్రాయశ్చిత్తము.

(లోపలధ్వని "యజ్ఞదత్తా" అని)

అయ్యో యీతాపసపుత్రుని జనకులితని నరయుచున్నారు. వారివలననైనను మృతిఁ బొంద శాపముఁగైకొందు.

(నిష్క్రమించును).

---

## పూర్వరంగము.

## తృతీయప్రకరణము—అదే నదీతీరమున నడవి.

---

కావడిలో వృద్ధాంధులైన తాపసమిథునమును ప్రక్కన దశరథుఁడును మూర్ఛిల్లియుందురు.

యజ్ఞదత్తుని శవము నందే యుండును.

తా—హాపుత్రా! హాతనయా! ఇట్లుమమ్మెడ బాసి పోవుదువని మేమొక్క నాఁడు నెఱుఁగముగదా? మామాలదైవము నీవుమాకు లేకుండఁజేసెనే.

తా—(స్త్రీ)—తనూభవా! వృద్ధులము నంధులమునైన మమ్మొకావడిలో నుంచుకొని యీ యాయాసమనక మోయుచువచ్చితివే. ఇంకమమ్మెవ్వరు రక్షించువారు?

తా—అయ్యో! మాకేలయీపాడు దాహముగలిగెను? ఊచినబోవనుండు మాప్రాణతుల గొడ్డంట్రఁ గొట్టినట్లాయెఁగా?

తా—స్త్రీ—తనూజా! నెలదినములక్రిందట మాకిరువురకుఁ గలిగిన వ్యాధులవలననైనఁ జావమైతిమే. ఇదిచూచుటకే కదా?

దశ— (అనుబంధము. 2.)

మునివతంసమా! నాప్రాణములన్నియు మీకే యర్పించుచున్నాను. ఈపాపభారము సహింపఁజాల. ఇప్పుడే నాయంత మొనర్పుఁడీ ప్రార్థించెద.

తా—అయ్యా! మాప్రాప్తియిట్లున్నది. నీవేమిచేయఁగలవు? నీశబ్దవేధులు మాప్రాణవేధులుగా మాముద్దుతనయుని హృదయవేదన మొనర్చునపుడు వాఁడాడినకడమాటయింత వచింపుమా.

దశ—హాదుఃఖము-దుఃఖము-తాపసవర్యా! నాక్రూరకృత్యమునకుఁ దగిన దండన మొనర్చితిరేని మీసుతుఁడాడినమాట వచించెద.

బ్రా—ధరణీశా! మేమేమిశాస్తియొనర్తుము. ఆదైవమయున్నాఁడు. కరుణించి చెప్పుమా. వాఁడేమనెను?

దశ—తాపసవర్యా! ననుదరిఁ జేర్చుటకు మీకు రెండేతెరవులు. శపించి నిర్దహించుటయొకటి. లేదేని కరుణించి నాశుశ్రూషమీ కొమారుని మారుగాఁ గైకొనుటయొకటి. ఈరెండవభంగియే మీకిష్టమైన రాజ్యమంతయు సన్యసించి మీకొడుకునకు మారుగా మిమ్ముమనినంత కాలముమోసికొని తిరుగాడుచు నాపాపములోని లవమైనఁ బాపికొనుటకై—

బ్రా—ఏమిసౌఖ్యమని మేమీప్రాణముల భరింతుము. కాంతా! నాప్రాణము లిప్పుడే యుత్క్రాంతములగు నట్లున్నది.

స్త్రీ—నాథా! నాకునట్లే. అయిన నేమ్మృతిఁ బొందుటవరకునింత భరింపుమా, నీప్రాణముల.

బ్రా—రాజేంద్రా! కడుపుణ్యమగును. మావాఁడేమనెను చెప్పుమా యిప్పుడచచ్చెదము.

దశ—నన్నుక్షమింపుడు. నాకోరికయేదైన మీరొనరింప కున్న నేఁ జెప్పను.

బ్రా—రాజాధమా, ఇట్టికటికిబుద్ధిదగునా? మానోటి కడిదీసి నిరపరాధు మాకొమారుఁ దెగటార్చి క్షణార్థమునఁ జావనున్నతలిదండ్రుల యాశాపూర్తి నొనరింపవా?

మానిని ||

భూపకులాధమమాదగు ముద్దులపుత్రునినూరక చంపితివా
పాపముచాలక మాసుతు మాటలఁబల్కవె నిర్దయమానసయీ
తాపముచే నడలొందికలంగి "సుతా సుత" యంచెటుచచ్చెదమో
యీపగిదిన్మరణంబుననాఁటి "సుతా సుత" యంచునెచావుమిఁకన్.

శతవృద్ధులమైన మేము ఏకపుత్రవిషయమయి యెట్లు "పుత్రా! పుత్రా!" అని యఱచిచచ్చెదమో యట్టిప్రాప్తియే నీకుఁ గలుగుఁగాక.

దశ—వాచంయమివర్యా! నాఘోరపాపమున కీయల్పశాప మెక్కడికెక్కును. అయ్యో! మీకరుణయెంతనివచింపవచ్చును. నలువదియేండ్లనుండి యెన్నివివాహములైనను

యెన్ని పూజావ్రతాదుల నొనర్చినను, బుత్రులఁగానక "పుత్రుఁడో పుత్రుఁడ" నియే కరుచున్న నాకు మీశాపవ్యాజమునఁ బుత్రునిఁ గలిగించితిరే. వాదుష్కృతము నీజన్మమునఁ దీఱ్పనీక చచ్చి నరకముల పాలగునట్లు మాత్రమొనర్చితిరి.

ఉ. ఎన్నఁగరానిపాపమున కీక్రియశాపమటంచుఁబుత్ర సం
పన్నుఁగఁజేయఁజాలితిర పత్యవిదూరుని నిట్లునింతురే
మన్ననఁదాపసోత్తముల మానసమానవనీత తుల్యమం
చున్నెఱిఁబల్కుపల్కులిటు చూడనిదర్శనమయ్యె మీయెడన్.

ఇప్పుడు నిశ్శంకముగా మీపుత్రుని కడమాటవచించెదను. దుష్కర్ముఁడనైననన్ను దగ్ధునిఁగాఁ జేయకుండఁ దనమాఱుగా మిమ్ము వేఁడమనివాఁడు. ఇదియే యతని మాట. ఎంతటిదయాళుఁడో.

బ్రా—స్త్రీ— }
బ్రా— } హా ! కుమారా ! కరుణాకరా ! (చత్తురు).

దశ—హా ! దైవమా ! (మూర్ఛిల్లును).

---

శ్రీ

# పాదుకా పట్టాభిషేక నాటకము.

## ప్ర స్తా వ న.

శా. శ్రీమీనాక్షీవిలాససుందర ధరిత్రీజాతయైసంతతం
బామోదంబుఘటింపఁదల్పఘన నాగాధీశుఁడాసన్నుఁడై
సౌమిత్రిప్రథితాభిధానమునఁ దానైదోడుగానొప్పు నా
రాముండీవుతభక్తసంతతులకున్ రారాజదైశ్వర్యముల్.

(అనుబంధము. 3.)

ఉ. ప్రాకటమంజు సంస్కృత సరస్వతి ధీరపదార్థగౌరవా
నేకతవిల్లసిల్లఁగవు లెవ్వరువ్రేలిడ నేరకుండఁ గా
నేకవిలోకమౌళి రచియించెను రాముచరిత్రమట్టి వా
ల్మీకిలసద్వివేకిఁ జిదమేయపినాకి నమస్కరించెదన్.

(అనుబంధము. 4.)

---



# పాదుకా పట్టాభిషేక నాటకము.

## ప్ర థ మాం క ము.

### ప్రథమరంగము-దశరథునాస్థానము.

[ప్రవేశము: దశరథుఁడు-వశిష్ఠుఁడు-సుమంత్రుఁడు-సేవకుఁడు].

వశిష్ఠుఁడు—అట్లయిన నీయిష్టము. నీకే భయముగానున్నపుడు కానిమ్ము.

దశ—భయమునకుఁగాదు. నాకేమో చేయవలయుననియే తోఁచుచున్నది.

వశి—రామునితో మాటలాడియున్నావా ?

దశ—ఎక్కడిది ? నేఁడుదయమునఁగదా నాకుఁదోఁచినది నిన్నరాత్రివఱకు నీప్రశంసయేలేదే.

సేవకా ! రామునిఁబిలుపింపుము.

వశి—భరతుఁడు లేకుండునదిమాత్రము చింతనీయము. ఈ దుస్స్వప్నఫలము ఘోరమని నీవేయంటివే. కావున నాకేకేఁడును రాకముందే యీకార్యమొనర్పవలెనని బుద్ధి వొడమినది.

[ప్రవేశము: రాముఁడు].

రామ—(నమస్కరించి కూర్చుండును).

దశ—రామచంద్రా ! అఱువదిసంవత్సరములనుండి పృథ్వీపాలన మొనర్చి యెనుబదియేండ్లుమీఱిన వృద్ధుఁడనైతిని. ఈచైత్ర శు॥ ౫॥ యే శుభదినముగా వశిష్ఠులు నిశ్చయించినారు. నీపట్టాభిషేకమునకు నీవంగీకరింపవలయు.

రామ—జనకా! ఉన్నట్టుండి యిదియేమి ? ఇంక నేఁబదియేండ్లయినను రాజ్యమేలుటకు సమర్థుఁడై నీవుండ నాకేటి కీప్రయాస మిప్పటినుండి ?

దశ—తనయా ! నీకుఁబదియు నెనిమిదవయేఁడు సమీపించె. ఈశుక్లనవమికిఁ బదునేడునిండుఁగదా ? చిన్నవయసున రాజ్యమేలఁగలిగినఁ బ్రజల సుఖదుఃఖములు చక్కగా నెఱుఁగవచ్చుఁగదా ?

రామ—జనకా! నీమాట జవదాటువాఁడనా ? అయినను క్షమింపుము. నేఁడు విదియగదా ? ఈ మూఁడుదినములలోఁ బట్టాభిషేకము కావలసినంత త్వరయేమి ? అదియునుగాక భరతశత్రుఘ్నులునులేరు. వారులేక యీకార్యమును జరుపుటకు నాకుఁగుతూహలముండునా ? ఈలగ్నము కాకున్నను మఱియొక లగ్నమాయెను. నను మన్నించి వారలఁ బిలువఁబంపుము.

(అనుబంధము. ౫.)

తే.గీ. చెలువుమీఱఁగఁ బట్టాభిషేకవేళ
నెవ్వరెవ్వరు పెఱవారలేగుదెంచు
వారుగాయుట్టిచోఁ గూర్మిగారవించు
చిన్నితమ్ములులేకుండఁ జేయ నేల.

వశి—రామా! నేనెంతయుఁజెప్పితిని, నిన్నరాత్రిగలిగిన యొకకారణమున మీజనకుఁడు నీకుఁ బట్టాభిషేకము చేయఁగోరినాఁడు. దినముల నాలోచించిచూడ రేఁపుపంచమి తప్ప మఱిదినము దొరకదు. కావున విధిలేకవచ్చినది.

దశ—పుత్రా! నేనంతయు నాలోచించియేయున్నాను. భరతుఁడులేక నిన్నభిషిక్తునిఁ జేయవలెనని నాకేమికోరికయా? పదిదినములక్రిందట నీబుద్ధి గలిగియుండిన భరతుని గిరివ్రజపురమునకు నేనేలపంపుచుంటిని. ఈశుద్ధనవమికి నీపదియునెనిమిదవయేఁడు పడును. సమవత్సరమున నభిషేకముచేయరాదని యార్యులందురు. రాగల సంవత్సరమునఁ జైత్రమాసమున గురుమూఢము రాఁగలదఁట. తర్వాతఁ జాతుర్మాస్యల నొనర్పరాదు. మరల మాఘమాసమున శుక్రమూఢము రాఁగలదఁట. చైత్రమాసమువఱకు వదియుండునట. ఇంతలోన నే యిరువదియవ సంవత్సరమురాఁగలదు. కావున నా వత్సరమంతయు సరిపడదు. ఇట్లే మూడేండ్లు కడచవఁగలవు. కావున నిట్లుప్రయత్నించితిని.

రామ—మూడేండ్లు కడచనిన నేమి? పిదపనేకానిమ్మేమి యవసరము.

దశ—పుత్రా! అట్లుకాదు. ఊరక మార్గ్యము నూనియున్న వాఁడనా? శీఘ్రముగనే నీకుఁ బట్టము గట్టవలసిన కారణములు నిన్నరాత్రి గలిగినవి. అవియన్నియు నీకెఱిఁగింతులెమ్ము. ఆయిననావృత్తాంతము నీవు మీతల్లులతోఁ జెప్పకుము. భీతిల్లుదురు. కావున విధిలేకున్నది. ఇదినీవొనర్పకున్న నాకుత్సాహభంగము గాఁగలదు.

(అనుబంధము. 6.)

కం. ఎన్నాళ్ళకు మునోన్నినీ
కెన్నిలఁబట్టంబుఁ గట్టనిట్లేకడచెక్
మిన్నక కాలంబిఁకనో
యన్నా సలుపంగఁ గూడదాలస్యంబుక్.

కం. ఊరక యోచింపకుముకు
మారకయీకార్యమైన మఱిచేకూరుక్
గోరిక లెల్లనుదీఱుక్
భారమునావాంఛితంబు వాటింపఁగదే.

రామ—నీయాజ్ఞకు వ్యతిరేకముగలదా? నీయిచ్చతెఱంగున నేకానిమ్ము.

దశ—మంత్రీ! సుమంత్రా! రేఁపు బుధవారమున నే పట్టాభిషేకము కావలసియున్నది. నేఁడప్పుడే భానువారమాయెను. సర్వ సన్నాహములు నీవెట్లుచేయఁగలవో. పుత్రా! ఏల యాలోచన?

రామ—భరత శత్రుఘ్నులు లేరుగా యనియే.

దశ—ఏమిచేయవచ్చును ? అక్కడికి పోవనే మూడునాళ్లకుఁ దక్కువ కాకుండఁబట్టును. యత్నములేదు. పోదమురమ్ము.

(నిష్క్రమింతురు).

---

# ప్రథమాంకము.

## ద్వితీయరంగము-కైకేయియిల్లు.

---

[ప్రవేశము: మంధర].

మంధర—ఆహా ! పురమంతయు నలంకరింపఁ బడుచున్నది. ఎవ్వరు చూచినను నగుమొగములలరారస్వర్గమేలఁ గలిగినట్లు సంతోషభరితులైయున్నారు. రామునికిఁ బట్టాభిషేకమఁట ! రామునికఁట ! పట్టాభిషేకమఁట ! రామునికిఁ బట్టాభిషేకమైన నీజనులందఱికేమి ? తమకే యభిషేక మగునట్లు త్సాహముజెందియున్నారు ! ఈదుఃఖము నేఁజూచియోర్వఁగలనా ? నేనిందు కైకేయి వెంటవచ్చినదిమొదలు దుఃఖమునకే కారణమైయున్నది. నేనెవ్వరికేమపకారముఁ జేయకున్నను, పురజనులందఱు నన్నుఁ దిరస్కరించెదరు. ఒక్కరైన నాచెలిమిఁగోరరు. ఒరులచెలిమిఁ గోరినేఁ బోయినను నన్నుఁ జేరనీరు. నేఁబోయితినా మాటలాడుచున్నవారందఱు మాటలుడిగి నేవెడలివచ్చువఱకు మౌనముద్రవహించెదరు. ఒక్కరిమాట లితరులకుఁ దెలిసెనా, మంధరయే చెప్పెనని మొత్తికొందురు. ఇండ్లలో రహస్యము లేమయిన మాటలాడవలసి వచ్చినఁ దొలుత వెలుపటికి వచ్చి నేనేమైన నున్నానాయని చూచి పిదప మంతనములాడెదరు. నేఁ గాలుద్రవ్వి జగడమునకుఁ బోయినను, వాకిండ్లువేసికొందురుగాక తిట్టుటకైనను నాతో మాటలాడరు. అందఱు నన్ను నికృష్టపు చూపుచూచెదరు. కైకయొక్కతెయే నన్నేమియు ననది. దానికి నీనడుమఁ దెగులుగలిగియున్నది. ఎవరేమిచెప్పిరో ! తనమగనితో నున్నప్పుడు తప్ప మిగిలిన యన్నివేళల దాని నేమఱకున్నానే. ఎవరు చెప్పఁగలరు? ఆమగనితో నున్నప్పుడును, ఏమఱకుండుటకై వారిగదికి వారికిఁ దెలియకుండ గండివెట్టి వారిమాటలన్నియు వినుచున్నానే. కావునదశరథుఁడైనను నాపైఁ జెప్పియుండు ననుట కవకాశములేదు. ఏమో యేమియుఁ దెలియ కున్నది. నన్ను గన్ను మఱఁగించి యెవ్వతెచెప్పియుండును ? నన్ను మించిన వారు నున్నారుగా యీయూర ? ఆహా! తెలిసెను. నన్ను రాముఁడు పుట్ట చెండుతోఁ గాలువిఱుగ వేసియున్ననాఁడు కాలునొప్పివలన నేఁ బండుకొని యుండిన కాలమునఁ గౌసల్య యీకైకతో మంతనము లాడియుండెను. దానియింటి కిది పోయియుండెను. అయిన నదిజరిగి నాలుగేండ్లాయెనే కైక.

కీదుర్బుద్ధి పుట్టి నాల్గైదు నెల లాయెను. ఇట్టిపీడచోట నాకేమిపని? పోదము అని యెంచియుండియు, ననుఁదిరస్కరించు నీపురివారికొక గుణుమైనఁ జేయకపోవచ్చునా యని వేఁచియుంటిని. ఇప్పుడు సమయ మబ్బెను. రామునికిఁ బట్టాభిషేకము!! అరణ్య పట్టాభిషేకము చేయించెదను. దానికైయెగురు లాడుచున్న యీ పురివారి కశ్రుజలాభిషేకముఁ గావించెదను. అప్పుడ యోధ్యవారందఱు మంథర ప్రభావముఁ దెలియనీ—ఈకైక కేమి రిమ్మయో యిదియు నెగురులాడుచున్నది. ఇదె వచ్చెను.

[ప్రవేశము: కైకేయి].

కైక—మంథరా! ఇక్కడనేమి చేయుచున్నావు?

మంథర—నీవేమింత సంభ్రమముగాఁ బోవుచున్నావు?

కైక—రామచంద్రుని పట్టాభిషేకమని నీవు వినలేదేమే?—

మంథ—ఆహా?

కైక—అదియే మిక్కడనున్నావు నీవు?

మంథ—బండికొఱకు పంపియున్నాను. నిరీక్షించుచున్నాను.

కైక—బండి యేమిటికి?

మంథ—ఊరికిఁ బోవుటకు.

కైక—ఏయూరికి?

మంథ—గిరివ్రజపురమునకు.

కైక—ఎవరియొద్దకు?

మంథ—మీతండ్రి కేకయరాజునొద్దకు.

కైక—ఏలపోయెదవు?

మంథ—మనసు పుట్టినది గనుక పోయెదను.

కైక—అందుపోవ మనసేలపుట్టెను?

మంథ—ఇందుండ నిష్టములేనందునఁ బోవమనసుపుట్టెను.

కైక—ఇట్టిమాటలేటికే? ఇన్నాళ్లుండిన యిష్టము నేఁడేలలేకపోయె?

మంథ—నేను, కౌసల్యదాసికి దాసిగా నుండఁజాలను.

కైక—కౌసల్య దాసి యెవ్వరు?

మంథ—నీవు.

కైక—నేను కౌసల్యదాసి నెట్లగుదును?

మంథ—రామునికిఁ బట్టాభిషేకమైన నీవు కౌసల్యదాసిగా కింకెవ్వరవు?

కైక—మంథరా! ఇట్టిమాటలాడకుము. ఆ రామునిపై నీవు పగసాధించెదవా? చిఱుతదనమున, కందుకముతో నిన్నుఁ గొట్టినమాత్రముననే యిట్టిపగవలయునా? ఆరాముఁడెవ్వరను కొన్నావు? నాకూర్మిసుతుఁడు. వానికిఁ బట్టాభిషేకమయిన నాకుఁ బరమభాగ్యముగదా?

మంథ—(ఏడ్చుచు) కైకా! నీకేమి బుద్ధిపుట్టెనే? ఎవరెట్టి మందు పెట్టినారే నీకు? నీయుత్తుకకుఁ ద్రాడుబిగించుచున్నది నీవెఱుఁగకున్నావు. కాళ్లక్రిందఁ ద్రవ్వి గుంటచేయుచునది కానలేవు. మిత్రులన మిత్రుల నరయలేవు. వినాశకాలమా సన్నమైయుండ నీవిపరీతమాటలేల విందువు? నాకేమయినదిని నీయిచ్చచొప్పునఁ జెడిపోవనిత్తుఁ గాని మీతండ్రి నిన్నత్తగారింటికిఁ బంపునపుడు నిన్ను నాకిల్లడ పెట్టినాఁడే. నేనెట్లూరకుందును? రామునిపై నాకుఁ బగయంటివే. ఇన్ని దినములయినదే యొక్కనాఁడైనా వానిప్రస్తావము నీయెదుటఁ దీసియున్నానా? నాకన్నులనీవు చెడిపోవుటచూడఁ జాల. కావునఁబోయెద.

కైక— మంథరా! నీవేమన్నను నాకా కౌసల్య సుతునిపైఁ గూర్మిమానదు. అయ్యో! రామునినా నీవిట్లనవలయు.

మంథ—కూర్మియేల మానునమ్మా? ఆకౌసల్య నీకు సవతిగాదు. తోడఁ బుట్టువు. అయ్యో! ఆకౌసల్యపై నింతపడి మొత్తుకొందువే. అదినిన్నుఁ గాలిగోరంతైనను సరకు సేయునా? నామాటలిప్పుడు నీవేలవిందువు! రేపుప్రొద్దున రాముఁడు చక్రవర్తియై భరతుఁడు వక్రమూర్తియై వానిచరణములు శిరసావహించి యూడిగము సేయునప్పుడైన నన్నుఁదలఁపవా? జనులందఱు నిన్నుఁజూచి "ఈకైక తనకు సరియెవ్వరనియు, కౌసల్యాదుల కంటెఁ దనపైఁ బతికెక్కువ కూర్మియనియు గర్వించుచుండెఁగా? ఇప్పుడు గదాయిది యొక భోగినియనుట స్పష్టమాయెను" అనివచించుచు ముసిముసి నవ్వునపుడైన ననుఁదలఁపవా? కౌసల్య చక్రవర్తి మాతయై "కైకాయిటువచ్చి కాళ్లొత్తుమని" నిన్ను బిలువ "కౌసల్యాదేవి! భాగ్యము" అని నీవు బానిస తనము చేయవలసివచ్చినపుడైననన్నుఁ దలఁపవా? ఏమిసార్థకము! ఏండ్లెక్కువగు కొలఁది బుద్ధి తక్కువగునందురు గదా?

కైక—మంథరా! ఏల యీమాటలు?

చం॥ జగదభిరాము రాముని వసంతతిసాగర పూర్ణసోమునిన్
దెగడెదవేటికిట్లు విననేరఁగదా యిటువంటిమాటల
న్మగువరొ యేలయింత పగమానుము నాకు హితంబుగూర్తువే
నిగరుపమార రామునకె నెయ్యముమీఱ శుభంబుఁగోరుమా.

రాముఁడు భరతునికంటె నాయెడ నెక్కువభక్తిగలవాఁడు. కౌసల్య తోడఁబుట్టువు నకంటె నెక్కువగా ననుఁ జూచును. వీరెట్టివారైనను నాపతియుండలేదా? వారికిబుద్ధిగఱపఁడా?

మంథ—నీపతి—వసీపతి—అతనిచరిత్రము తెలిసి యుండిన నిట్లాడుదువా? చెప్పిన నేనే యెరవులదాననగుదు.

కైక—ఏమిచరిత్రమే? దాపక నాకుఁ జెప్పుము.

మంథ——అదియుండనిమ్ము. నీపతినీయం దిచ్ఛగల వాఁడేకానిమ్ము. రాముఁడు రాజ్య మేలుకాలమంతయు నతఁడు వెడలబ్రదుకునను కొన్నావా? శతవృద్ధుఁడైకాటికిఁ గాలుసాచియున్న వాఁడెన్ని దినములు జీవించియుండఁగలఁడే?

కైక——(హరిహరియని చెవులుమూసికొని).

(అనుబంధము. 7.)

కం. ఆహాహా యిదియెంతటి
సాహసవాక్యంబెయింత సంతాపమునిం
తేహరిహరి యెటులోర్తుదు
రాహాతియిటులాడ మంథరానీకగునే.

మంథరా! ఎట్టికర్ణకంటకములగు భాషణములాడెదవే.

మంథర——అమ్మా! క్షమింపుము. తప్పాడితి నీపతిస్థిరజీవి. బ్రహ్మచచ్చినను, అతడు చావడు. ఉన్నమాట యున్నట్టన్న నుందూరచ్చి రాదందురుగా? నీపతికలకాలము మని యుండినను, అతనిమాటేమైన జరుగఁగలదా? సార్వభౌముఁడైన రాజు వేఱె యుండఁగా నతఁడేమైననని నతఁడును నీతోఁగూడ నిల్లువెడలవలసినవాఁడెగదా! కైకా! నీకేమిమరులే-నీకేమజ్ఞానమే. నీపతిచరితము చూచిచూచి యిట్లుమోసపో యెదవు.

కైక——ఏమే నాపతిచరితము? నాకొక్కటియుఁ దెలియదు.

మంథర——తెలిసియుఁ గన్నులుతెఱువకున్నావు. నీపతికి నీపై మోహముగలదని యెం చియున్నావా? చెప్పుము.

కైక——నాకేమియు సందేహముతోఁపదు.

మంథ——కైపు తలకెక్కినప్పుడేల తోఁచును. పోనీ నీకొడుకుపైననతనికిఁగూర్మికలదా?

కైక——అదియేమే? అతనికి రాముఁడువేఱె భరతుఁడువేఱెయా?

మంథ——కైకా! లోకమునందఱు నిన్నుపాయశాలిని యందురు. ఇందుకా? భరతుఁడు మీయయ్యగారి యూరికిఁబోయి యెన్నిదినములైనది?

కైక——పదిదినములైనది. ఇప్పుడేల?

మంథ——ఇప్పుడుగదా పట్టాభిషేకము. వాడులేకుండ వానివేఱూరికిఁబంపి యిపుడు పట్టముగట్టనెంచినాఁడే చాలదా?

కైక——మనము వినలేదా శుభదినము లింకఁగలుగవని దశరథుఁడు త్వరలో నీకార్యము తలపెట్టెనని?

మంథ——నీకెట్టి విశ్వాసగుణమే. మూడుసంవత్సరములనుండి మీతండ్రి కోరుచున్నాఁడే యిప్పుడాభరతుఁ బంపవలయు?

కైక——భరతునిఁబంపునపు డీప్రశంసయే లేదుగదా?

మంథ—కోడిపాలు పిదికితెచ్చినామన్నఁ బేఱపెట్టుమను దానవుకదా నీవు? ఈపట్టాభిషేక ప్రశంస మెన్నఁడునులేక యిప్పుడే టక్కునఁబుట్టెఁగా? ఇప్పటికి సంవత్సరముక్రిందటనే రామాదుల వివాహములు చేసుకొనివచ్చినపుడే రామునికిఁ బట్టాభిషేకమింతలోనే చేయవలయునని నీపతియన్నట్టు నీవేచెప్పితివే. మఱచితివా?

కైక—అపుడు మాటకలిగెను. తర్వాత మఱచియుండరాదా?

మంథ—ఈయుక్తి దశరథునికైనఁ దోఁచియుండదు. పోనీ-భరతుఁడులేక యీకార్యము చేయను నాఁడే నిన్నొక్కమాటయయిన నడిగినాఁడా?

కైక—నాయొద్ద కింకనురాలేదు. వచ్చినపుడు చెప్పునేమో.

మంథ—"చెప్పునేమో" భరతుఁడులేక యీపని చేయునందుకు నిన్నూరార్చుటపోయె. నినువేఁడుకొని నీయనుజ్ఞవడయుటపోయె. నీవొడంబడకున్న నీకాళ్లపైఁబడుటపోయె. "చెప్పునేమో" కదా? భానువారమునాఁడుగదా యీప్రశంసగలిగె. అర్రాత్రి నీనాథుఁడెందుండె.

కైక—కౌసల్య యింటనుండెను.

మంథ—ఇక్కడికివచ్చి నోటిమాటైన నీతోఁ జెప్పఁడాయెఁగా.

కైక—మొన్న కౌసల్యవంతుగదా?

మంథ—వంతు. వంతెన్నఁడు దప్పఁడో నీమగఁడు?

కైక—విధిలేని సందర్భము గలుగకున్నఁ దప్పఁడు.

మంథ—భరతునిఁబంపి నాల్గుదినములైనను గాకముందె రాముని ముండమోయించ నెంచినాఁడే. ఈమాట నీతోఁజెప్పవలయుట "విధిలేనిసందర్భము" కాదుగా? నీవింకను "ప్రీతి" యనెదవు!

కైక—ఏల యిట్టి నిష్ఠురము లాడెదవే? నేవినఁజాలను.

మంథ—పోనీ నిన్న సుమిత్రదిగదా వంతు? ఎందుండెను?

కైక—సుమిత్రయింటనే—కాదు నిన్నను గౌసల్యయింటనే యుండెనని వింటిని.

మంథ—ఇక్కడ వంతుదప్పునట్టి విధిలేని సందర్భమేమమ్మా?

కైక—(యోచించుచూరకుండును).

మంథ—(స్వ) ఇప్పుడు కొంచెము మార్గమునకు వచ్చునట్లున్నది. (ప్ర) నీవూరకున్న నేఁజెప్పెదువినుము. ఆ కౌసల్య కుమారునిపైఁ గూర్మివలననేకదా నిన్నను నందుండుట. ఇంకను బట్టాభిషేకమయినఁగాలేదే. అప్పుడేవంతు దప్పునంత గూర్మిగలిగిన ముందెట్లుండును?

కైక—హా! శ్రీహరీ! మంథరా యిప్పుడు స్మరణకువచ్చుచున్నది.

మంథ—నీస్మరణపై మన్నుపోసిరి. మేలుకోరి బుద్ధిచెప్పవచ్చిన నాకు (ఏడ్చుచు) రాముపైఁ బగగట్టితివి. నిను బానిసగాఁజేయనున్న కౌసల్య యుత్తమోత్తమయంటివి ఆవంతైన నిను సరకుసేయని పతినామునికి మోసుకపోవునంత ప్రీతియంటివి. నేనీయింటనుండను. పోయెదను. (లేచును).

కైక—మంథరా! ననుక్షమింపుము-కరుణింపుము-నీకంటె నాకాప్తులెవరు. నిలువుము. (పట్టుకొనినిలుపును).

మంథ—నీకు హితులహితులగు కాలమువచ్చియున్నది. మాతల్లి గొంత్రాలయ్యన్నదట్లు నా యని విశ్వసించు బుద్ధిగలిగియున్నది. నీయింట నేనుండ నేయుంధను. (విసరును).

కైక—(మంథర చరణములు పట్టుకొని).

మంజుభాషిణి. ఉరియాండునాదుమది యారడిల్లునా।
వెరవింతచూపికదు ప్రేమనింపవే।
యిరవారనాకునీక నెవ్వరేసఖు।
ల్నిరసింపనౌనె కరుణింపుమంథరా॥

మంథరా! ఇట్టిసమయమున ననుఁజేవిడువవచ్చునా? నమస్కరించి వేడికొందును. పోకుము.

మంథ—(కూర్చుండి) ఇంకేమిచేసెదవు? మించిపోయె. నిర్వాణదీపమునకుఁ దైలము పోసిన నేమిప్రయోజనము?

కైక—మంథరా! నీవుదప్ప నను సంరక్షించువారులేరు. దీనికేమైన యోచనయున్నం జెప్పుమా.

మంథ—వెన్న చేతఁబెట్టుకొని నేతికి వెదకెదవే? అంతయు నీస్వాధీనమున నే యున్నది.

కైక—నా స్వాధీనమున నేమున్నదే?

మంథ—భ్రాంతా! దేవాసురలయుద్ధమునాఁడు నీమాయోపహార విద్యకు మెచ్చి రెండువరముల నీపతియీఁడా?

కైక—ఆహా! మఱచియుంటినే. భరతు పట్టాభిషిక్తుఁజేయుట కిప్పుడే యొకవరమడిగెదను.

మంథ—మిగిలినయొకటి నేమిచేసెదవు?

కైక—ఇంకెప్పుడైన నుపయోగమగుఁగదా?

మంథ—బుద్ధిశాలినివి! ఆవరమడుగుటకంటె నూరకుండుము. బ్రదుకఁగోరిన రెండు నిప్పుడే యడుగుము.

కైక—మఱియొకవరము నేమనియడుగుదును?

మంథ—కైకా! నేను దీర్ఘయోచనచేయక మాటాడనని నీవియ్యకొందువుగదా? మాటలు కఠినములైనను, ఉపాయమును మనసును మంచివని నీవొప్పుకొందువుగదా? నేనేమయినఁజెప్పిన నీకుఁగోపము రాదుగదా?

కైక—మాతల్లిమాఱుగ నీవున్నావు. నీవేమన్నను బరమార్థమని భావింతుఁగాక కోపము గలుగునా?

మంథ—ఆరెండవవరమునకు శ్రీరాముని బదునాల్గేండ్లరణ్యమునఁ దపసి వృత్తి నుండఁ బంపఁ గోరుము.

కైక—హా! శ్రీహరీ! (చెవులుమూసి) మంథరా! ఎంతమాటాడితివే! ఎట్టి పాపము వినుపించితివే. భరతునకుఁ బట్టము గట్టనడిగిన నడుగవచ్చుఁగాక రాము నరణ్యమున కుఁబంపనెట్లు వేడుదును? నానో రెట్లాడుదును? రాముఁడే! భక్తికరుణాధాముఁడే! ఇనవంశాబ్ధిసోముఁడే! రూపజితకాముఁడే! అతఁడా యరణ్యములనుండవలయు? నాచేతఁగాదు. వలయునన్న భరతుఁడే యరణ్యముననుండని. వాఁడు రామదాసుఁడేకానీ. నేను కౌసల్యదాసినైన నగుదు. కానియట్టి దుశ్చరితమునకు నేనియ్యకొందునా.

కం. అయ్యోదరాజ్య బహిష్కృత
నయ్యెదఁగౌసల్యదాసి నైననకటనా
నెయ్యంపుసుతునిఁగానల
కయ్యోపనుపంగనెట్లు లడుగుదునబలా.

మంథ—రాముఁడే—కైకేయీమనోజ్ఞసోముఁడే. రాజ్యసర్వస్వకాముఁడే. కుత్సితగుణధాముఁడే. నన్నేలనిల్పితివి? రాముఁడు కానలకుఁ బోవకుండిన భరతునకుఁ బట్టాభిషేకమెట్లగునని యింతతెలియఁజాలవే.

కైక—మంథరా! అది యేలకాదు?

మంథ—ఇట్లుడుగుము. యుక్తియున్నఁగైకొనుము. మూర్ఖము మాత్రముమానుము. నీకు వరమిచ్చిన, పట్టాభిషేకమునకు భరతునిఁ బిలుపింతురుగదా? అప్పుడురాముడుండిన నీయూరిముండలు దశరథుఁడు కౌసల్యయు నూరకుందురా? భరతుని వేడికొనియైన రామునికిఁ బట్టముగట్టింతురు. అప్పుడు నీవు వరమడిగి చెడుగుమాత్రము గట్టికొందువు.

కైక—నీమాటల నెంతయుక్తియున్నను గ్రూరకర్మముగదా? తపసివేషమున నేలయుండఁగోరవలయు? పదునాల్గేండ్లేల కోరవలయు?

మంథ—ఊరక యవివేకమునఁగాని క్రోధమునఁగాని యీవరముఁ జెప్పితినని యెంచకుము. రాముడరణ్యమునకుఁ బోయినను భరతునిలోఁ జేసికొని దశరథుఁడు వానిబిలుపించి పట్టమొసఁగకుండును. అట్లొకవేళ రాముఁడు వచ్చినను తపసివేషముండకుండిన రాజ్యమేలునేమోయను భీతిచేతను, ఈవరమడుగఁ జెప్పినాను.

కైక—నీమాటలు నాకుఁదెలియవు. పదునాల్గేండ్లైనపిదప రాముని బిలుపించి రాజ్యమివ్వఁగూడదో దశరథుఁడు?

మంథ—కైకా! లోకవృత్తమింతైన నీకుఁదెలియదా? మీదశరథుఁడు యెన్నిదినములు బ్రదుకఁగలడని యెంచియున్నావు? పదియేండ్లుండును. ఇంకను నెక్కువైనఁ బండ్రెండేండ్లుండును. నేనింకను రెండేండ్లెక్కువగా నుంచియున్నానే.

కైక—మంథరా!—

మంధ—తాళుము. ఒకవేళ నింకను నెక్కువనాళ్లు బ్రదికినను, పదునాల్గేండ్లు రాజ్యమేలిన వానిఁదప్పించుట సుకరముగాదు. అదిగో పల్లకిమోయువారల ధ్వనివినుపించుచున్నది. నీమగఁడు వచ్చుచున్నాఁడు. ఇంకఁదడయకుము. ధైర్యమువదలకుము. రామునిఁబంపువరమే తొల్తనడుగుము. సమీపమునకేవచ్చెను. పొమ్ము. కోపముపైవేసికొనుము. పొమ్ము-పొమ్ము.

కైక—(నిష్క్రమించును).

మంధ—ఇంతమట్టుకు మార్గమునకుఁదెచ్చియున్నాను. ఇంకఁదిరుగఁజాలదు. అగ్నిపెట్టితిని. పొగరాజుచున్నది. దానిమంటఁ జూచుభాగ్యము నాకుఁగలుగునా? ఇంక రాముఁడు పట్టాభిషేకము చేసికొనుఁగాక! దశరథుఁడునుఁ గౌసల్యయుఁ గన్నులు చల్లఁగఁ జూచెదరుగాక! ఊరిముండలందఱు నెగరులాడుచుఁ బోయెదరుగాక!

[ప్రవేశము: దశరథుఁడు.]

దశ—మంథరా! కైకయెందున్నది? ఇల్లంతయు వెదకితిని.

మంధ—(నిట్టూర్పు విడుచును.)

దశ—అదియేల యీనిట్టూర్పు. కైకకేమైన నాపదగలిగెనా?

మంధ—అదియేమియులేదు? మీకైకయా కోపగృహమున నొక్కరితోడను మాటలాడక పండుకొనియున్నది.

దశ—ఏమీ-ఏమీ-నేఁబోయి విచారింతును. మంధరా! నీవిందేయుండుము. (పోవును)

మంధ—(తలఁద్రిప్పి) ఉండెదనులెమ్ము—

(వెనుక యవనిక నెత్తినఁగైకేయి గాసిల్లి పండుకొనియుండును.)

దశ—(కైకయొద్దకువచ్చి) తరుణీ! ఈవిధియేమి? నీవిట్లుండుటకుఁ గారణమేమి? రాకాసుధాకర బింబముఁబోలు నీముద్దుమోమేటికి నేఁడు వాడియున్నది? తెలివికలిమిఁజేపట్టినవాని ధన్యుఁజేయు నీకన్దామరలేటికశ్రు జలములనిండియున్నవి? నే వచ్చినవెంటనే ముదమారఁ జిలుకలకులుకుపలుకుల "నాథా! ప్రాణేశా"! యని పిలిచినావీనుంగవలకానందమునించు నీమోముఁదమ్మి నేఁడేల మౌనముద్ర వహించియున్నది? ఏతెంచినవెంటనే మానక యెల్లవేళల నన్నాశ్లేషించుచుండిన కేలుదోయి నేఁడేల యొకటికొకటి పీడించుచున్నవి. విలువగలజిలుగువలిపట్టువలువమాని యీ ప్రాఁతచీర నేఁడేలవచ్చె? ఒక్కొకటి యొక్కొకజగముసైన వెలకుఁగొనఁగల బలుసొమ్ములు నేఁడేలమైఁబూనవు? అవి యేయపరాధమొనర్చె? కాంతామణీ! ఎవ్వరివలన నీకీపరిభవముగలిగె. ఎవ్వరునీమది నొవ్వఁజేసిరి? ఉద్దిలేని ముద్దుచిలుకవోలె సమ్మదమ్ముగ్రమ్మ నెమ్మివోలె సంచునించునంచవోలె నిన్ను నేఁజూచికొందుఁగా? అట్టి నీకపరాధమొనర్చినవాఁడెవఁడు? తనప్రాణముల నించుకైన సరకుసేయని యాత్రారాత్ముఁడెవఁడు? కామినీ! నీయాజ్ఞ యించుకకలిగిన దరిద్రుసైన నింద్రుఁజేయఁజాలుదు. ఇంద్రుసైన దరిద్రుఁజేయఁజాలుదుఁగదా? ఒక్కమాటాడుమా. నీవగపునకుంగారణమేమి? తరుణీ! ఏలిపలుకవు?

కైకా! నయనప్రభాకాత్తరిత సారంగపాకా! శిరోజాతసమంచిత విభానిరాకృత చంచరీకా! పయోధరయుగళనిరస్తకోకా! సుందరీనిజప్రతీకా! సమంచితబింబోష్ఠికా! బహుసుశ్లోకా! మహిమాస్తోకా! నిరంతరవసర్యాకా! విగళశోకా! మత్ఫలపరిపాకా! కృపాలోకా! కైకా! నీకేటికీకాక? నాపైఁగోపమా లేక యేటికి సౌమ్యభావమున ననుఁజూచి యాజ్ఞాపింపవు-లెమ్ము.

కైక—(లేచి యేడ్చుచు) నాథా! ఎంతయుండియు నేననాథనైతిని గతిగలిగెఁ కడుఁజాలకనైతి. నాయభీష్టము నెఱవేర్చువారు లేరైరి.

దశ—మనోహారిణీ! నీయభీష్టమైన నేమి? సర్వాభీష్టములు సమకూర్ప నేనుండ నీకేటికీ కొఱంత?

కైక—నీవనుటకేమి? నీవాడినంత జరుపుదువాయను సంశయమును నాకుఁగలిగెడు.

దశ—అయ్యో! ఇట్లేల నన్నలంతిఁగాఁజూచెదు. పొలంతీ! నిన్నన్నులపలంతియంచు కన్నులఁగప్పికొందునే. నీమాటఁ జవదాటుదునే. నీకేటికీసంశయము. నీయభీష్టమెట్టిదైనను, ఎట్టిదుస్సాధ్యమయినను, నాకు శక్యముమాత్రమాయెనా నెఱవేర్తును. నీయాన, నాయాన, రామునాన, నెఱవేర్తును-అనతిమ్ము.

కైక—అట్లయిన రాముని మాని మాభరతునికిఁ బట్టముగట్టుము.

మంథ—(స్వ). పాదుముండ యిట్లేలడిగెను

దశ—ఏమీ! ఏమీ! కైకా! నిక్కమాడితివా? నేనేమయినఁ దప్పొనరించితినా? నా మనసు పరీక్షించెదవా?

కైక—త్రికరణశుద్ధిగా నిక్కమాడితిని.

దశ—హా! దైవమా! కైకా! నీకేటికీకోరిక? రాముఁడు నీకెట్లుపరతుఁడు? హాఁడు పట్టమున కేటికర్హుఁడుకాఁడు? భరతునికంటె వాఁడు నీకెట్లప్రియుఁడు? ఇట్టిమాటలాడకుము. నీమాటలు నీకే కర్ణశూలములుగా నుండుఁగా నాకెట్లుండఁజాలవు?

కైక—ఎట్టియసాధ్యకార్యమైనను శక్యముమాత్రమాయెనా చేసెదనంటివే. వచనమిచ్చి లేదనుము. నాకంతియచాలును.

దశ—ఏలయిట్టి విషమపరీక్ష? ఇది నాకుశక్యమా? నేనెట్లు వచనముఁ ద్రిప్పినవాఁడను?

కైక—చేతనున్నది. ఒక్కమాటాడిన జరుగునది. ఇది శక్యముకాకున్న నింకేదిశక్యము. అయ్యో! నేనెంత మోసపోయితిని- నాపతి నన్నుఁ బ్రాణపదముగాఁజూచునని యెంచియుంటి. నాకివ్వఁదగనిపదార్థ మతనికొక్కటియు లేదని నమ్మియుంటినే. ఊరివారందఱు ననుఁజులుకనగాఁజూచినను నాపతియట్లొనర్పఁడని నచ్చియుంటినే. ఆనమ్మకము, ఆనచ్చికోలు, వమ్మాయె-వితయాయె.

(అనుబంధము. 8.)

మంథ—(స్వ) భళిభళి.

కైక—రాజేంద్రా! నేనింకేలమనవలయు. మనియెవరినమ్మవలయు. నమ్మియెవరి నుద్ధరింపవలయు. ఏదైనను బావియో, చెఱువో చూచికొందును. నీవును నీకౌసల్యయు నీరాముఁడును నిశ్శంకముగానుండుడు. (పోవఁబోవ.)

దశ—(నిలిపి కౌఁగిలించి) కైకా! ఇన్నిదినములనుండి నన్నరయుచుంటివే. ఇన్నాళ్ళ నుండిలేనిబుద్ధి నీకేలకలిగె? నినునమ్మినవాఁడనే-ఎన్నఁడైనఁ జాలుకనగాఁజూతునా? నీవేబాసచేయుమన్నను చేయుదును. ఇదిగో ఈముద్దు.

కైక—రాజేంద్రా! ఈవిన్నాణములుచూపకుము. ఈముద్దులుచాలును. మోహముల మోసపఱచుట నీకసాధ్యము. నాయభీష్టము నెఱవేర్చిన వేయిముద్దులునాకెక్కును.

దశ—కైకా! నీవు సద్గుణముల ప్రోవుగదా? ఈక్రూరగుణముమాని నన్నాదరింపరాదా?

కైక—ధరణీశా! ఇక్ష్వాకుకులజులు ఆడితప్పనివారని పేరొందిరి. ఆవంశమున నసదృశ కీర్తినైమంటివి. సత్యసంధుఁడవని ప్రసిద్ధిఁగంటివి. కోరినకోరిక జరుపుదునంటివి. నాకోరికవింటివి.

దశ—సౌహార్దమున సమరసభావము వాటించిన నీబుద్ధిమురఁజొచ్చెఁగా? మోహంపు టన్నువౌటనొండనరామి నూరకుంటిని. నాకుఁగోపమువచ్చును. ఊరక బుద్ధికలిగి యుండుము.

కైక—(ఏడ్చుచు) అయ్యో! మాటతప్పియు నన్నే తెగడనాడుట కలిగెఁగా? ఆహా! నాగురదృష్టము! రాజేంద్రా! ఇదెపోయెద. కూపమునఁబడియెద. దీనికైన నాజ్ఞ యిమ్ము.

దశ—కూపమునఁగాకున్న నీప్రాప్తియున్నదానఁ బడుపొమ్ము. నాయాజ్ఞయేల? నీవో కరియాజ్ఞలో నుండినఁగదా?

కైక—భూమ్యాకాశదైవములారా! (ఏడ్చుచు) మీరేసాక్షులు. ఇట్టియసత్యవాదికా లన్నై మని యుండఁజాలక యసువులఁబాయఁబోయెద.

దశ—అనృతోదరీ! నీచెడుగునకు దైవముల నేలసాక్షులఁగోరెదవు? నేసత్యసంధుఁడగుటయు, కాకుండుటయు లోకమెఱుఁగదో. నీప్రాప్తికొలఁది పోవుచున్నానమము.

కైక— (నిష్క్రమించును).

దశ—అకటా! ఈయబల యింతటిరాక్షసియగునే.

శా॥ ఆహాహా యెఱుఁగంగనైతిఁగదయీయంభోజపత్రాక్షి సం|
దేహంబేటికిఁ గోళ్ళరాత్రియగు సాధ్వీరత్నమౌనంచుఁగా।
లోహింబెంచితి మోసపోయితి నపాయంబయ్యెనీతన్వికి।
ద్రోహోద్యోగము గల్గనేమిటికి నాదుప్రాప్తికేమందునో॥

మంథ—(స్వ) (చేతులుగొట్టి) అయ్యో! ఎంతతెలివిలేనిముండ! వరములేలయడుగ రాదు?

[పునః—ప్రవేశము: కైకేయి].

కైక—అచలాధీశా. నేఁబోయితినని సంతోషపడితివి కాఁబోలు. పీడవీడెననుకొంటివి కాఁబోలు. నేనేలపోయెదను నీమాట నీకొప్పగింపక? అల దేవాసురలయుద్ధమున నాకు రెండువరముల నిచ్చితివే. అవియైన నిత్తువా యివ్వవా?

మంథ—(స్వ) శబాస్. ఇదినాకంటె దుర్మార్గముమండ. నాకీచమత్కారము తోఁచియేయుండదు.

దశ—హా! శ్రీహరీ!—కైకా నేననృతవాదినని యెంచితివా. ఇచ్చనదియిచ్చియేయున్నాను. మిన్నువిఱిగిమీఁదఁబడినను ఇత్తును. అయిన ననుగ్రహించి సద్వరముల నడుగుము.

కైక—నీకు దుర్వ్వరములనుపించునవి నాకు సద్వరములనియే తోఁపవచ్చుఁగదా. నేనడిగినవరముల నిచ్చెదవాలేదా యింతచెప్పుము.

దశ—నీవిట్టికట్టడివౌదువని యెఱుఁగనైతి. వేలోకటఁగానిపని వరముల నెపమున సాధింపఁజూచెదవు కాఁబోలు. ఇట్టిదుర్మార్గురాలికి లేదన్నను బాపమురాదు. అయినను, సత్యబద్ధుఁడని జగమంతయు నన్నెఱుఁగుఁగావున నీకిచ్చెదను. త్రికరణశుద్ధిగా నిచ్చెదను. నీవరములలో మించివచ్చినది రామపట్టాభిషేకము భంగముగదా? రాము నెల్లియైన వేఁడుకొనఁగలను. ఆరెండువరములు నిప్పుడేయడుగుము. క్రూరకృత్యములన్నియు నొక్కసారియేకానిమ్ము.—

కైక—మిక్కిలి సంతోషము. అట్లయిననడిగెదను. ఒకవరమునకు భరతుని పట్టాభిషేకమొనర్పుము. మఱియొక్కటికి పదునాలుగేండ్లరణ్యమునఁదాపస వృత్తిమైనుండునట్లు క్షేపింపుము రాముని.

దశ—హా! శ్రీహరీ! (మూర్ఛిల్లును).

కైకా!—కైకా! నాపాడుచెవులకు నేఁడేమైన భ్రమము గలిగెనా లేక నిక్కముగ నీవు రామునరణ్యమునకుఁ బంపుమంటివా?

కైక—పదునాలుగేండ్లు.

దశ—హా! హా! శ్రీహరీ!

కైక—తపసివేషమున.

దశ—కైకా! కైకా!

కైక—క్షేపే.

దశ—అయ్యయ్యో!—మారాముని పాలిటిపగదాయవైనా పాలిమృత్యుదేవతవై మాయింటికిఁ గాలసర్పమవైతివిగదె? ఏమిసంతోషమని యీక్రూరవరమడిగితివే. భరతునకుఁ బట్టముకట్టుదుఁగాక రామునరణ్యమునకుఁ బంపుట యేమికోరికయే. ఎవ్వని సుగుణము నాబాలచండాలముగ లోకులందఱుఁ బ్రశంసింతురో యిక్ష్వాకుకులజులెవ్వరు పడయని సత్కీర్తి యీచిఱుతదనమున నెయెవ్వఁడువడసెనో, ఏవాఁడు తనతల్లికంటె నెక్కువగ సవతి తల్లులకు భక్తియొనర్చునో, తనభ్రాతలఁ దనశరీరములోని భాగములుగ నెవ్వాఁడు ప్రతీక్షించునో, ఎవ్వని నొకనిమిషమువీక్షింపకున్న నేమనఁజాలనో, యట్టిమహానీయుఁడు దిగంత విశ్రాంతయశోవిలాసుఁడు, దైతేయతు పారచండభానుఁడు, పరశురామ గర్వవిభేది, కౌశికప్రియశిష్యుఁడు, సీతాప్రాణనాథుఁడు, వానిపైనీకీద్వేషమేల? నీకేమివాఁడు విషముపోసెను. నీభరతునికి

వాఁడేమియుండరాములుగలిగించె. నాసంతోషమున కగ్నిహోత్రమునిడితివి. హృదయమునఁ గాలకూటమునభివర్ధిల్లఁజేసితివి. నాపాలి కాళరాత్రివైజనించితివి. కటకటా! కైకా; నేబహుదినములు మనువాఁడఁగాను. విధాతృడిచ్చిన యాయువు నీవేల తగ్గించెదవు? నేదీనుఁడ-వృద్ధుఁడ-అనన్యథాగతికుఁడ. నినుశరణొందినవాఁడ. నీచరణము లంటివేఁడెద. ననుఁగరుణింపుమా. ఈక్రూర వృత్తముమానుమా-నాపై దయరానిమ్మా. (నమస్కరించును.)

కైక—(ఆవలబోయి) రాజేంద్రా! ఈటక్కులేలచేసెదవు? నేనేమడుగరానిదడిగితి. నీమోసమునకు నేను లోఁబడనని నమ్ముము. (నిష్క్రమించును.)

దశ—హా! దైవమా! నాకేమిప్రాప్తిఁ దెచ్చితివి.

(అనుబంధము. 9.)

ఇన్నిదినములుమని తుదకీదిక్కులేనిభంగికలుగునే-అక్కటా! దీనినేల నేనుచేపట్టితిని. అయ్యయో! నాముద్దులపట్టి నామోహముతనయు నేనరణ్యములకుఁ బంపి యెట్లీ ప్రాణముల భరియింతును. కటకటా! ఈమారికి నేనేలవరము లిచ్చెదనంటిని? సత్యప్రతిజ్ఞఁ బాయుదునా? లేక దుర్మరణమున కియ్యకొందునా? ఎట్టి దుర్మరణ ముగల్గినను నానోటివెంట నాత్రిలోకసుందరు నరణ్యములకెట్లు పొమ్మందును? కామాతురుఁడనియు, కఠినహృదయుఁడనియు నన్నెల్లరు గువ్వకరిగొని తిట్టరోటు? కౌసల్యయేతెంచి రాముపట్టాభిషేకమేల మానితివన్న నేనేమి వచింపఁగలను? అయ్యో! పట్టాభిషేకము మాత్రము మానుటకాదే. ఘోరాటవులకుఁ బంపుటయే. మారణవిధియే ఈదుఃఖసాగర మేగతిఁదరియింతును? ఆరాముఁడు. అర్థిజనసురారాముఁడు-రిపుభీముఁడు-కరుణాధాముఁడు వచ్చినను మాటలాడించిన వానికినే ముఖము నెట్లు చూపుదు? రామచంద్రా! సద్గుణసాంద్రా! నీఋణము నాకింతయే సుమా. అకటా. ఎట్టిక్రూరకర్మునకు నీవు కొడుకవై జన్మించితివి? ఎట్టికులాంతకునికి నీసుతత్వము సమకూఱె. ఎట్టినిర్భాగ్యుని, ఎట్టిపాపుని, ఎట్టిపగదాయ నెట్టిద్రోహిని, నీవు తండ్రియంచు నమ్మితివి! నీముదుమోమింకెట్లుచూచెద? దైవమా! మారామునకు జనకాజ్ఞఁదిరస్కరించు బుద్ధియైనఁ గలిగింపుమా. అట్టిసంతసమయిన నాకుసమకూర్పుము. అట్లైన నిశ్చింతముగమనఁగలఁగదా? ఆరాముఁడట్టివాఁడుకాఁడే, నేనేమిచేయుదును? దైవతోత్తములారా! ఇప్పుడే నాప్రాణములఁ బాపరాదా? ఘోరభూకంప మిప్పుడే యుద్భవించి యీ యయోధ్యనంతయుమ్రింగరాదా? కాలవ్యాళములారా! ఈ క్రూరకర్ముని మీవిషానలముల దహింపరాదా? సౌధమా! ఇప్పుడవిఱిగి నాపైఁబడరాదా? చిత్రరూపముననున్న పితృపతీ! నీవిప్పుడ సజీవుఁడై నన్నుఁగొనిపోరాదా? అయ్యో! ఈప్రొద్దేటికిఁ బొడుచుచున్నది? జీవరాశి నిద్దుర లేపి వారిహృదయములలరింపఁ గలకమల బాంధవుఁడు నాకేల తపనుఁడైయున్నాఁడు. ఈప్రొద్దైనఁబొడువక జగమంతయు నిట్లేరాత్రిమయముగానుండి యంతరించిపోయిన

నాకెంత సంతోషముగానుండును ? ప్రభాకరా ! నీవు మావంశకర్తవుగావా ! నీకేల కరుణగలుగదు ? అనుగ్రహించి యుదయింపకుండుమా. అక్కటా! అప్పుడే తొలిదెస యుదయదరుణ కిరణ పురోగమ సాంధ్యరాగముల ధరియించె. ఈసూర్యుఁడు తానేల యుదయింపకుండును ? ఇంతయైన నాపై నక్కటికము చూపఁడుగా? ఖరకరుఁడనుట విదితమాయెను. ఇప్పుడె నానారాచమున వీని రూపుమాపెద—(ధనువెత్తి). ఆహా! నాకేమిబుద్ధిమాంద్యము! నావిధిపైకోపమీభాస్వంతునిపైఁ జూపనేమిటికెక్కును? దశరథా! దశరథా! నీవీసూర్యుని మఱియొకనాఁడు చూడఁగలవా? ఇంకెక్కడి సూర్యుఁడు. ఎక్కడి దశరథుఁడు ! హా రామా!

[ప- సుమంత్రుఁడు]

మం—(దశరథుని సమీపించి) రాజన్యా! నరపాలకంఠీరవా ! లెమ్ములెమ్ము. ఇదె తెల్లవారె - మంగళస్నానము వేళయాయె. అభిషేకమండపమున శ్రీరాముఁడు సుస్నాతుఁడై లక్ష్మణుతోడ సుఖాసీనుఁడై యున్నవాఁడు. వశిష్ఠాదిసంయమీంద్రులు కర్తవ్యక్రియాలాపముల నిర్వహించుచున్నవారు, మీరాకం బ్రతీక్షించుచున్నారు. లగ్నమాసన్నమాయె. ధరాధిపచూడామణి ! పరాకు ! ముఖ్యభృత్యుఁడు సుమంత్రుఁడు విన్నవించుచున్నాఁడు.

శ—(లేచి కన్నీరునించి) హా ! రామా ! హా ! దైవమా! (నేలఁబడును.)

మం—హా ! హా ! ఏమిది ?

[ప్ర-ప్ర-కైక.]

క—సుమంత్రా ! రామునిందు తోడితెమ్ము. పొమ్ము.

మం—

కం॥ మాతా యిదియేమిటికీ।
భూతల నాథునకు వింతపొగులు గలిగెనిం।
దేటిలు యరయ నాకీ।
యాతత శోకంబుగతము నానతియిమ్మా॥

అమ్మా ! కైకేయీదేవి ! ఇదియేమి రాజన్యుఁడు—

క—మాటలఁగాలహరణమేల ? రాముఁడేతెంచిన నన్నియు విశదములగును. వేళమపొమ్ము.

(నిష్క్రమించును.)

మం—

శ—కైకా ! నాపైనింత యైనసీకుఁ గరుణకలుగదా ? నేనేమపరాధమొనర్చితి? నాయెడ నీకున్నదని యనుచున్న మోహమునకిది తార్కాణమా ? రామునేల పిలుపించితిని ? వానితో నేనెట్లు మాటలాడుదు ? దేవీ ! నీవు కాకున్న నన్నెవ్వరు రక్షించువారు ? నాయపరాధము లెన్నియున్నను గారుణ్యభావమున క్షమింపుము. కాకున్న నీయాన నేనసువుల భరింపఁజాల. ఈ వృద్ధునిపైఁ గార్పణ్యముమానుము. నను రక్షింపకున్న విడువను. అభయమీకున్న మనను.

(అనుబంధము. 10.)

(కాళ్లపైఁబడును.)

కైక—(విదలించి) రాజేంద్రా! ఈ హాగత్యమేల? వరములీలేనపుడు. ఈ యూరడీ యేల-నాసవతి కౌసల్యకు భీతిల్లి నాకు మ్రొక్కెదవా? ఇంకఁజాలు పొమ్ము—

[ప్ర-రాముఁడు-లక్ష్మణుఁడు-సుమంత్రుఁడు (ప్రక్కన.)]

రాము—సుమంత్రా! ఎందున్నాఁడు మాయయ్య? ఎందున్నాఁడు?

సుమం—దేవా! ఆభవనమునన్నారు.

రాము—అయనఁ బోవుదము.

దశ—కైకా! ఇదెరాముఁడు వచ్చిన జాడతోఁచుచున్నది. ఇఁకనేమనఁజాలను. ఇమ్మె నాకభయము, (కాళ్లంటును.)

కైక—ఈ వగలింకఁ జాలునూరకుండుము.

దశ—ఎంతటి కఠినాత్మురాలవే! ఎంతటికిరాతకివే. అయ్యో. (ముసుఁగిడును.)

రాము—(దశరథు నొద్దకువచ్చి) అయ్యా! అయ్యా! సుమంత్రునియెదుట నీవు కన్నీరు నించితివఁట! నీకెట్టిదుఃఖము గలిగె? నేఁడేల ననుఁజూడకున్నావు? ముసుఁగైనను దీయవు. నీమోము దమ్మిఁజూడఁగూడనియంతపరాధము నేనేమి చేసితిని? ఎప్పుడు నను వీక్షించినను గౌఁగలించుట మానవే. ఇప్పుడు నేవచ్చి యింతసేపయినను జూడవేల? నీపెదవినుండి మాట వెడలినంతనే యెట్టికార్యమునైన నొనర్పఁగల కొడుకులుండ నీకేల యీదుఃఖము. అయ్యో నీముసుఁగునను నీవక్షో భాగ మెగరిపడుచు నీకుఁగల యపారదుఃఖము వెల్లఁగించుచున్నదే. నిన్నసాయం తనమున ననుఁ బట్టాభిషిక్తుఁ జేసెదనని మహానందమున మాటలాడితివే. ఒక్క రాత్రిలో నాయానంద మెందుఁబోయెను? ఏభూసురుల నీవెట్టిగాసి వెట్టితివి? ఎట్టి శరణాగతుల శత్రువులకప్పగించితివి? ఎట్టిసత్యముల జరుపక పోయితివి? ఎట్టి పరధనములఁ బరస్త్రీల నీవు కాంక్షించితివి? నీయేకుమారునకెట్టియాపదగలిగె? అయ్యో? ఆగిరివ్రజపురమునుండి యేమయిన వృత్తాంతము తెలిసెనా? భరత శత్రుఘ్నులు క్షేమముగనున్నారా? అయ్యో! నీవు మారుమాట వల్కకున్న నాప్రాణములు నిలువఁజాలవు. ఒక్కమాటాడి నాయనుతాపముఁ దీర్పరాదా?

(అనుబంధము. 11.)

(పైఁబడియేడ్చును.)

దశ—(ముసుఁగుతీయకయే రాముఁ గౌఁగిలించి) రామా! రామా! (ఏడ్చును.)

రాము—మాతా! కైకేయిదేవీ! ఇదేల మాయయ్య యిట్లుదుఃఖించుచున్నాఁడు? నీకుఁదెలియక నాజనకునకింత పాటుగలుగునా? ఏల యూరకున్నావు? ఎట్టి వార్తకాని కొంకక సూచింపుము.

కైక—కుమారా! దేవాసురులయుద్ధమునాఁడు మీతండ్రి నాకు రెండువరముల నిచ్చియుండెను. వానినిప్పుడడిగితి. భరతునికిఁ బట్టముగట్టనొకటికి, తాపస వృత్తి

మై నేఁడే నిన్ను పదునాలుగేండ్లరణ్యమునకుఁ బంపనొక్కటికి వేఁడితి. ఇచ్చెను. ఆమాట నీకుఁ జెప్పుటకు వాయోడిశోకించుచున్నాఁడు.

దశ—హా రామా ! హా రామా!

లక్ష్మ—కైకేయి దేవీ ! ఇట్టిక్రూరవరములా—

రాము—లక్ష్మణా! ఊరకుండుము. జనకా! ఇంతకార్యమునకింతయోచింపవలయునా? నీవు శోకించుటకైనదిన నేమున్నది? పదునాల్గేండ్లునన్నరణ్యముననుండ నియమించుట యాశోక కారణము? భూప్రదక్షిణాభిలాషము నాకు మిక్కుటముగానున్నదనియెన్ని మాఱులో విన్నవించితినే. పట్టాభిషేకమునకియ్యకొనునప్పుడును నీయానతి మీఱరామిచే సమ్మతించితిఁగాక నాకు దేశదర్శనాభిలాషమే మెండుగనుండెను. నేఁ బ్రార్థించినను నీవనుగ్రహింపకుండిన యర్థమీదేవి నాకిప్పించి స్తోత్రపాత్రయయ్యె. కావునదీనికై శోకింప నేటికి. ఇంకభరతుని పట్టాభిషేకమునకు శోకించెదవా ? నాసోదరుఁడే. నాపైఁ గూర్మిగలవాఁడే? నీకొడకులలో నెక్కుడగుభక్తికలవాఁడే. అట్టివాఁడు రాజ్యమేలుట నీకును నాకును సంతోషకరముగా నుండవలయుఁగాదా? నీవునాకభిషేకముచేసి యుండినను, మాభరతురాజ్యమున నిల్పినేదేశదిదృక్షచే వెడలవలయుననియే యుంటి. మున్ముందే యామాటచెప్పికొన్న నీవు సమ్మతింపవో యనుభయమున నీకుం జెప్పకుంటి. ఈ తల్లి వరముల వ్యాజమున నాయభీష్టము నెఱవేర్చి పరమసమ్మదమావహింపఁజేసెఁగా. ఇదియింతయొప్పునే. ఇవియన్నియు నట్లుండ వరములిచ్చినవాఁడు తండ్రియఁట. వేడినది ప్రేమగల తల్లియఁట. రాజ్యమేలువాఁడు విశ్వాసపాత్రుఁడగు తమ్ముఁడఁట. ఇందునవేది మీఱఁదగినది. జనకా! ఇంచుకయు యోచింపకుము. ఈ పదునాల్గుసంవత్సరములునుఁ బదునాల్గు దినములుగాఁ గడచనఁగలవు. నేనవశ్యము పితృవాక్యమును జరిపెద. ఒండనకుము. ఇదేపోయి మిగిలిన తల్లులతోడను సీతతోడను ఈ సంతోష వార్త చెప్పివచ్చెద.

(అనుబంధము. 12.)

(పోవుచు.)

నాకానతిమ్ము.

దశ—(లేచి) రామా! రామా !—శ్రీరామా !—నిన్నుగాన—

(క్రిందపడును.)

రాము—(మరలివచ్చి) జనకా ! శోకింపకుము. ఇది యేలొకో యిట్లుశోకించెదవు ? నేనిప్పుడ మరలివత్తును. లక్ష్మణా ! పోదమురమ్ము.

రాము—<br>లక్ష్మ— } (నిష్క్రమింతురు.)

దశ—రామా ! రామా !

లక్ష్మ—(ప్రక్కన) జనకుఁడు మరలఁ బిలుచుచున్నాఁడు.

రాము—ఊరక కలువరించుచున్నాఁడు. మరలవత్తుముగదా ? పోదము.—

దశ—(గట్టిగా) రామా ! రామా ! రామా ! (నిష్క్రమింతురు.)

(ముందు యవనికపడును.)

ప్రథమాఙ్కము సమాప్తము.

---

శ్రీ

# పాదుకా పట్టాభిషేక నాటకము.

## ద్వితీయాంకము

### ప్రథమరంగము-కౌసల్యయిల్లు.

కౌసల్య (మంగళద్రవ్యములిడు కొనియుండి) క్రిందపడియుండును. రాముఁడులక్ష్మణుఁడు శిశిరోపచారములు చేయుచుందురు.

కౌసల్య—(లేచి)తనయా! నేఁడుదయమునలేచి నేనెట్టిపాపిముఖముఁజూచితి? నిర్ఘాతపాతముఁబోలినయీ బెట్టిదఁపువార్తవింటిని.

(అనుబంధము 13.)

నాహృదయమెట్టివజ్రకఠినమో. ఈవార్త వినియుఁ వ్రయ్యలు గాకున్నదే. అయ్యో! నీపట్టాభిషేకమునకని యీమంగళద్రవ్యముల సేకరించియున్నానే. హా! కైకా! ఇన్నిదినములనుండియుంత ప్రీతిపాత్రవుగానుండితుదకు సవతిమత్సరముసాధించితివే. తనయా! తనకొడుకురాజ్యమేలిన నేలుఁ గాకని న్నేలయడవులకుఁ బొమ్మనవలయు? ఇంతటిపగఘోరంబైనవింటిమే? ఈమాటకైకనీతో యెట్లాడఁ జాలెను. ఆపతియిందుకెట్లుసమ్మతించె. తనకుఁ గూరిమిగలకాంతకు వరములిచ్చిన రాజ్యమంతయు, తనప్రాణమైన నుసరకుసేయక యీవచ్చుఁ గాకపెఱవారికొడుకులనరణ్యములఁ ద్రోయుటొప్పునే? తనయా! నినుఁ బాసియే నెట్లునిర్వహింతును. నన్నెవ్వరాదరించువారు? అయ్యో! కొడుకరణ్యములకేగెడు. పతినిఁగైకకొనియున్నది. ఇంకెట్లుభరియింతు? తనయా! జనకుఁడుపొమ్మన్నంతనే యేయపరాధములేక నీవరణ్యములకేల యేగవలయు? రాజ్యమాశింపకుము. భరతునెగ్గులాడకుము. అయిన, నరణ్యములమాని నాయొద్దనుండుమా. జనకాజ్ఞపాలింపఁ దగినదియైన జనని యాజ్ఞపాలింపఁ దగనిదియా? నీవు ననుఁబాసిన నాప్రాణములునిలువవనుట నీవెఱుఁగవా? మాతృవధకైననియ్యకొలుగావించు పితృాజ్ఞయుంగలదా? కుమారా! నీవాకైకగర్భమునజనింపక నానిర్భాగ్యగర్భమున నేల జనించితివి?

(అనుబంధము 14.)

లోకసంరక్షణశాలియగు కొడుకు వాకుండియు గొడ్రాలికంటె నికృష్టమగు దశ నాకుఁ బ్రాప్తించెఁగా? తనూజా! నీపాదరేఖలాదిగాఁ జూచిన సాముద్రికులు నీవు ధరణీభరణదక్షుండవగుదువనిరి. వశిష్ఠాది సంయమీంద్రులు నినుఁ జక్రవర్తి పదస్థుడవు గమ్మని దీవనలిచ్చిరి. ఆశాస్త్రముల నాదీవెనల నీకైకయొక్క మాట మాత్రమువ

నబద్ధములఁ జేయుచుంటివిగా ! నీవు జనించినదాదిగా నిన్నొక్కనాఁడు బాసియుంటినా ? ఈవియోగసాగర మేగతిఁదరింతు ? పదునాల్గేండ్లు నిన్నుఁ బెంచినది యిట్లపు టకా ? పెంచిన ముద్దుచిలుకను బావురుగాని కప్పగించి నట్లాయెఁగా ? అయ్యయ్యో ! నీవు నాకుఁగలుగుటకెన్ని దినములఁ బూజించితి ! ఎన్ని వ్రతముల నాచరించితి ! ఎన్ని యుపవాసములఁజేసితి. ఇట్లు పాటుపడి కులాభరణమైన నిన్నుఁగనినది యీ క్లేశక కొప్పఁజెప్పుటకా ? అనుకంపలేక నన్నుఁ బాసిపోవ నీమన సెట్లొప్పెను ? తనయా ! రామా ! వలవదుడుగుమా యీయాచరణము.

రాము—జననీ ! నీ విట్లాడకుము. జనకాజ్ఞకైగదా పరశురాముఁడు తల్లినైనఁజంపినది ? నాకు జనకాజ్ఞ యెట్లో నీకునుఁ బతియాజ్ఞయట్లేగదా ? యోచింపకూడదిల్లు ను.

(యవనిక పడును.)

సీ॥ తల్లియెన్నఁడుగాని తప్పఁగూడని భంగి
వెలసెడు పతియాజ్ఞఁ దలప వలదె ।
యిన్నాళ్లు కీర్తి మైయున్న తండ్రికి సత్య
కలుషమబ్బెడు భంగిఁ దలఁపవలదె ।
కల్లనైనఁ బితృవాక్యమొనసి మీఱఁగలేని
తనయుఁ బుత్రత యింత తలఁప వలదె.
ఎట్టికష్టములైన నెలమిఁగొన్నాళ్లలోఁ
దొలఁగఁబోరుట యింత తలప వలదె ।
తే॥గీ॥ వనికిఁ జనఁగలోకం బేమిమునిఁగెనమ్మ ।
కడచుఁ బదునాలుగేండ్లెంత కాలమమ్మ ।
వనటఁ గుందంగనం తేమివచ్చెనమ్మ ।
కడఁగి మానుమమ్మ శోకంబు విడఁగదమ్మ ॥

(అనుబంధము 15.)

నేనొక్కఁడఁగదా కొన్ని దినములు లేకుండునది ? ఇందుకింతయేటికి ? భరతుఁడు నాకంటె నీయెడఁ భక్తిపరుఁడు. ఈలక్ష్మణుఁడు శత్రుఘ్నుఁడు నట్టివారె ? పేరుండ నీకేమికొఱఁత. నీవుదుఃఖించి యేమిప్రయోజనము ? నాకాజ్ఞ నిర్వహింపకున్నఁ దప్పదు.

కౌసల్య—రామా ! అయిన నీవు పోవ నేవలయునా ? నాయాజ్ఞ నిర్వహింపవా ?

రాము—తల్లీ ! నన్నీల సంకటమునకు గురిచేసెదు ? పితృాజ్ఞయనుల్లంఘ్యంబు. నను

మన్నింపుము. సుమిత్రాదేవియొద్దకును సీతయొద్దకునుం బోవలయు. మరల నీయొద్ద కే తెంచి నీతో మాటలాడఁగలను.

కౌసల్య-ఉ॥ అవ్యయలీలనీవు వసుధాధిప పట్టముగల్గరాజగా ।
దివ్యుఁడవై వెలుంగనభిషేకము వేళను నీకొసంగఁగా ।
భవ్యముగాఁగఁ గూర్చితి నపారముదంబునఁ నింక మంగళ ।
ద్రవ్యము లేమిసేయుదు విధాతృన కింతచలంబుగల్గెనే॥

అయ్యో! ఈమంగళద్రవ్యములు గలవే. వీని నేమి చేయుదు.

రాము-చ॥ అడలకు మమ్మ మీఱఁదగదమ్మ ధరావరుఁ గల్లసేయుటె।
న్నఁడువలదమ్మ యీపదియు నాలుగువర్షము లింతలోన నే।
కడచనునమ్మ నామనవిఁ గైకొనుమమ్మ యలంతసాకుని ।
మ్మడియగునమ్మ వీనికి నమస్కృతు లేనొనరింతు నమ్మరో ॥

(ద్రవ్యములకుఁ బ్రదక్షిణ నమస్కృతి సేయును).

కౌసల్య—హా! శ్రీహరీ! (మూర్ఛిల్లును)

# పాదుకా పట్టాభిషేక నాటకము.

## ద్వితీయాంకము.

### ద్వితీయరంగము-సీతనగరు.

[ప్రవేశము: రాముఁడు-సీత].

సీత—

(అనుబంధము 16.)

నాథా ! ఇట్టిక్రూరభంగి నీకుండుట యొకనాఁడు నెఱుఁగఁగదా ? నీకురాజ్యము లేకుండుటకే నోర్చితి. భరతునికిఁ బట్టాభిషేకమగుటకు మొదలే యోర్చితి. అరణ్యవాసమున కింతయైనఁ జింతింపను. సకల సంపదలు వాయుట కోడను. కానినిన్నుఁ బాసియుండుటకే నోపసుమా. నాయాన నీపాదములాన నేనిందుండఁజాల. పరీక్షించుట కిట్లాడెదవుగాక నిక్కమని నేనమ్మను నీవడవులకుఁ బోవ నీదండనున్న నాకెందునుఁగొఱవడదు. నన్నడవి పాలుచేయుటకే సహింపను. నీచరణములంటి వేఁడెద. వలవదుసుగుమా యీభయంకర కృత్యము. నన్నుమానుటయా ? నేనేమపరాధమొనర్చితి. నాపాడుచెవులెట్టి మాటలవినెను ? మనోనాథా ! నీవబయమీకున్నఁ బ్రాణముల భరింపఁజాల.

రాము—కాంతామణీ ! ఆయరణ్యముల నీవు నాతో నెట్లుండఁగలవు ? ఉద్యానవనముల సంచరించునపుడు కోమలలతలఁ ద్రొక్కినఁనీకాళ్లు నొచ్చుచుండెనే. ఆతానేల నీవు కాలెట్లూనఁగలవు ? వీణాస్వనమే యొక్కొకసారి కటువుగాఁ దోఁచెడు నీకు కాననమృగారావమెట్లు సహ్యమగు ? చిత్రప్రతిమలలోని సింగముల రాక్షసులఁ జూచి భీతిల్లు నీవు ప్రత్యక్షపూర్యక్షముల రాక్షసులఁ జూచి యెట్లోర్వఁగలవు ? నీవు నాతోడనుండుట నీకు సౌఖ్యమా? నాకు సౌఖ్యమా? వలవదుడుగుము. నామాటవినుము.

(అనుబంధము 17.)

సీత—ప్రాణేశా! పతిమాటవినకుండుట సతికిఁ బాపమగుట నేనెఱుఁగనిదానఁగాను. ఐననిట్టి మాటలు వినకున్నను దోషముగలుగదు.

కం॥ స్మృతిబొందఁ గోరె నేనియుఁ ।
బతిమాటవినంగవలయు పాడియెఱుఁగుదుర్
బతితన్నుఁ బాయనెంచిన ।
సతివలదను మాటకలుషసహితంబగునే ॥

నీవిందు లేకుండిననిదియే నాకరణ్యమగు. ఈహంసతూలికాతల్పమే శిలామయ తలమగు ఈసౌధాంతరమే పర్ణకుటీరముకంటె నికృష్టమగు. ఈపన్నీటివాకలే నదీనదములగు. నాచెలికత్తియలే రాక్షసులగుదురు! అయ్యో! ఈయరణ్యావాసము నాకేలకల్గెదవు? ఇటుమానిపోవుటకా మాజనకుఁడు ననునీకిచ్చినది? ఇట్టిదుస్తరవియోగము ఘటించుటకా యగ్నిసాక్షిగ నన్నుద్వాహమైనది? భూగమణా! అడవులలోనీవలయు నెడ నీకుపచర్యసేయ నేనువలదా? కైకేయి యేమయిన నన్నుఁబోవలదనెనా? అట్లయిన నామె పాదములపైఁబడి వేఁడికొందును. ఆమెకు నీయట్టి నిష్కారుణకలదేమో చూచెద. ఓపనోప. నినుఁబాసి నేనిందుమననోప. నీచరణములాన నేమాననోప. రక్షింపుము. రక్షింపుము:—

(అనుబంధము 17.)

(కాళ్లపైఁబడును.)

రాము—హా! దుఃఖము-కామినీ లెమ్ము లెమ్ము-ఏలయలఁతఁజెందెదవు? అడవుల నీవిడుమలఁబడలేవనిపల్కితిఁగాక నిన్నుమానిపోవనాకుఁగోరికయా? నీసరసనున్న యరణ్యమే నాకుస్వర్గము. పర్ణశాలయే నాకింద్రభవనము. కందమూలములే భక్ష్యభోజ్యములు. ఊరడిల్లుము.

(ప్రవేశము-లక్ష్మణుఁడు-దూరమున.)

లక్ష్మ—(దూరము పోవును).

రాము—లక్ష్మణా? రమ్ము. ఈసీతనావెంటవచ్చెదనని కడునిక్కచ్చి యొనర్చె. సంతాపముఁజూడఁ జాలకియ్యకొంటిని.

లక్ష్మ—ఊఁ—

రాము—ఏమూరక. "ఊఁ"—అంటివి? లక్ష్మణా! నీచందము నేఁడు చిత్రముగానున్నది. మనసారనొకమాటయిననాడవు. ఇక్కడికేలవచ్చితివి.

లక్ష్మ—రమ్మని యన్న వచ్చితి-

రాము—నేను నినురమ్మంటినా?

లక్ష్మ—రమ్మనకున్న నూరకయేవచ్చితి.

రాము—నీజాడలు నాకేమియుఁ దెలియవు. ఎట్లును వచ్చియున్నావు. దశరథునొద్దకుఁ బోదమురమ్ము.

లక్ష్మ—ఊఁ—

(నిష్క్రమింతురు)

---

# పాదుకా పట్టాభిషేక నాటకము.

---

## ద్వితీయాంకము.

### తృతీయరంగము—కైకయిల్లు.

---

ప్ర॥ మంధర.

మంధ—ఇప్పుడు కొంచెము నెమ్మదిగనిగియున్నది. ఇంకఁ దిరుగుటకు దారిలేదు. ఈప్రభావమూరంతయు నిప్పుడే తెలిసినది. ఊరియుండలందఱు నిప్పుడే యేడ్చుచున్నారు. ఏడ్వనీ—ఇంకను నేడ్వనీ—రాముఁడరణ్యమునకుఁ బోయిన నీవిధవలకంతయు నేమిపోయెనో. అక్కడ నెవ్వతెయో కండ్లనీళ్లొరుగ నేడ్చుచుఁబోవుచున్నది. ఆహా! నన్నుఁజూచి యావైపున మోముఁద్రిప్పి పోవుచున్నదీ. (దగ్గును). తిరిగియే చూడదు. దీనికేమి విషముపోసినాను.

[ప్రవేశము—కైక].

కైకా! ఎట్లు?

కైక—మంధరా! ఎంతకార్యమాయెనే. ఏమి యుత్పాతము గలిగెనే. నాపతిసంతాపముచెప్పఁజాలను. ఇంతగునని యెఱుఁగ.

మంధ—అయినదయినది. యిప్పుడుచింతించి ప్రయోజనమేమి?

(అనుబంధము. 18.)

ఆసంతాపమున నానాథుఁడు జీవింపఁగలడా యని సంశయము పుట్టుచున్నది.

మంధ—పీడవీడినది.

కైక—దుర్జాతివిధవా! ఇంతచేసి యిట్లాడెదవా?

మంధ—నీవుకానున్నానంటివి. నన్నేలవిధవాయనెదు.

కైక—అయ్యో! ఏమిప్రాప్తిఁదెచ్చుకొంటిని. దైవమా! ఇప్పుడేమిచేయుదును?

మంధ—సులభముగనే యున్నదే చేయఁదగినపని. తప్పొనర్చితినని దశరథు క్షమింపవేడుము. పిదపఁ గౌసల్యకాళ్లఁబడుము. రామునిపట్టాభిషేకము చేయింపుము.

కైక—చేయుదునా యట్లు?

మంధ—పిదపఁ జేయఁదగినది వినలేదే.

కైక—అదియేమి?

మంధ—తర్వాతభరతునిఁ గొనిపోయి యొకకూపమున నూకి నీవును నొకగుండు కట్టుకొని దుమికి చావుము. విధవాత్వము దప్పవలయునన్న వేఱుమార్గములేదు.

కైక—నాథుఁడు క్షమించిన పిదప నేనేల చావవలయును ?

మంథ—నేను నీకు హితము చెప్పుదానను ? నామాటలు నీవు విందువా ? నన్నేలడిగెదు పొమ్ము. నా కింతకంటె నుపయోగమైన పనిగలదు. విన్నుమాని తనకు ధాన్నైన బహుమాన మిచ్చెదనని కౌసల్య చెప్పిపంపినది. బ్రద్దుకుఁ దెఱవుచూచికొందును.

కైక—మంథరా ! దశరథుఁడు క్షమించిన నాకేల క్షేమకరము గాదు ?

మంథ—భరతుఁడు నీకుఁ గలిగినట్టులేదు. వాఁడు నీకు సవతికొడుకు. వానిపాలి పగదాయవైతివి. క్షమింపవేఁడిన దశరథుఁడు నిన్నేల క్షమింపఁడు ? అతఁడేమి సామాన్యుఁడా ? మొదట వరముల యడుగక యూరక భరతుని పట్టము వేఁడితివే. అప్పుడివ్వనన్నఁ గోపమున దుమికెదనని పోయితివే. అప్పుడేమైన వలదనెనా ? అవశ్యము పడుమనెను. తర్వాత వరములడిగి నిర్బంధించినప్పుడుగదా నీకాళ్లు పట్టుకొనఁ సాగెను. ఆబ్బినసిగ-అబ్బకున్న కాళ్లుగదా నీమగనికి ? ఇట్టివాఁడిప్పుడొకవేళ తన కార్యసాధనమునకు నిన్ను క్షమించినను తరువాత నిను మాటలాడించునా ? కన్నెత్తియైనఁ జూచునా. "ఇది కాలసర్పము. దీనియొద్దఁ జేరిన వినాశమగు" నని య్యెంచి నీయొద్దకైన వచ్చునా ? ఊరివారందఱు "ఎట్టి పలుగాకి యీ కైక" యని తిట్టుట మానుదురా ? నీవప్పుడు గాడిదపైనెక్కి నీపుట్టినింటికేగవలసి వచ్చుఁగదా ? అప్పుడు బ్రదికిన మగఁడుగల విధవ వయ్యెదవే. ఇంకేమయినను నీమగని వరములడుగఁ గలవా ? ఉన్న రెండువరములు పరిసమాప్తిఁజెందె. ఇంకేమోమున నడుగఁ గలవు ? ముఖ్యము కౌసల్యయే యదృష్టము గలది. "భోగినియగు భార్యయడిగిన వరములిచ్చిన పతి పట్టపుదేవి నేనడిగిన నెట్లివ్వఁడో యెట్లునిన్నడవికిఁ బంపునో చూతము" నియింతకుముందు కౌసల్య రామునితో ననెనఁట. దాని యభీష్టము నీవలననే నెఱవేఱఁగలదు. పట్టినపట్టు సాధింపవలెనన్న, కౌసల్యనుఁ జెప్పి యితరులఁ జెప్పవలయు. దాని చరణములపైఁబడుము. నీకంతవఱకు బుద్ధిగలుగదు. పతియఁట ! చచ్చునఁట ! ఏమయినదే నీ పతికిరిమ్మ ? అరణ్యములకుఁబోవు రాముఁడు మరలరాక యట్లేపాడయి పోవునా ? చత్తునని నీపతి చెప్పకొనెఁగాఁబోలు. దాని నీవు విశ్వసించితివి కాఁబోలు. మాటలలోనె ప్రాణముఁ బోఁగొట్టుకొనువాఁడు గూబవలెనిన్ని దినములు బ్రతికియుండునా ? మోసకారి పతిమాటలకింత గోలవవుదువు గనుకనే కౌసల్య నిన్నిట్లు చెవులుపట్టి యాడించునది. విశ్వామిత్రుని వెంట రామునిఁ బంపునడు సైతము నీపతి ప్రాణముల విడుతునని యిట్లేవాగత్యము చేయలేదా ? విశ్వామిత్రుఁడు విడిచెనా ? నీపతి గ్రుడ్లుపెట్టెనా ? ఇంక నీతో మాటలాడుటకుఁ గాదు. నానోరు నొచ్చుచున్నది—

కైక—మంథరా ! నీమాట నిక్కము. ఇప్పుడు వెనుదీసిన నపకీర్తి యొక్కటియే నిలుచు. నీవలె హితముచెప్పువారు నాకులేరు. నీయుపకారమునకే మొనర్తును. కొమ్మా చంద్రహారము. (ఇచ్చును.)

మంథ—(పారవేసి) నన్నుఁ దిట్టుటకిదియా యుక్తి? కూలికి నీకు హితోపదేశము చేసితి ననుకొంటివా? రేఁపు నీకొడుకును "చక్రవర్తి" యని పిలువ నీవు చక్రవర్తి మాతయై నన్నాదరించిన నా సంతోషమే చాలు నాకు బహుమతి.

కైక—(మంథర నాలింగనముచేసి) మంథరా! నీకు నాయెడ నవ్యాజ కరుణగదా? అది యేమే మంథరా వీధినిఁ గలకలము?

మంథ—చూడుమదె కౌసల్య వచ్చుచున్నది. జనులందఱు దాని దుఃఖమునుఁ దమ దుఃఖముగా భావించి యున్నారు. అందుకె యీ యలబలము.

కైక—ఇదేమే కౌసల్య పాదచారిణియై పల్లకిలేక వచ్చుచున్నది?

మంథ—ఇంతటితోఁ దీఱనా? నీ చరణ దాసికాఁ జాలదా? ఒక్కమాట. ఇది గయ్యాళి. టక్కులాడి. దీనిమాయలకు మోసపోవకుము. నీ విందుండకుము. పొమ్ము.—

కైక— (నిష్క్రమించును)

(ప్రవేశము-కౌసల్య.)

కౌసల్య—మంథరా! రాజన్యుఁడును గైకేయియు నున్నారా?

మంథ—(ఏడ్చుచు) అమ్మా యేలపోయెదవు? ఈ దుర్జాతికైక విడువని పట్టుపట్టి రాజేంద్రుని బాధింప సత్యవ్రతుఁడైన ధరణీశుఁడేమి చేయఁగలఁడు? ఇదియెంతటి పలుగాకి! దీనియొద్ద నేనుండను. దీనికొడుకే యీ పాడురాజ్య మేలనీ. నీపాదముల శరణొందెదను. మనము నరణ్యమునకుఁ బోదము రాము వెంట (కాళ్లపైఁ బడును.)

కౌసల్య—(కన్నీరునించి లేపనెత్తి) మంథరా! నీయుపదేశమైనఁ గైకవినదాయెఁగా? నీ వేమి చేయుదువు? ఎందున్నాఁడా రాజన్యుఁడు?

మంథ—ఆ గృహమున నున్నాఁడు. అయ్యో! భరతుఁడెట్టి కులటా సుతుఁడాయె!

కౌస—భరతునేల యిట్లాడెదు. వాఁడు నిరపరాధి? (పోవును.)

మంథ—(నవ్వి) పొమ్ము. నీకు క్రూరకర్మ కాఁగలదు. (ప్రక్కకుఁ బోవును.)
(వెనుక యవనిక నెత్తిన దశరథుఁడు-పడియుండును.)

కౌస— (దశరథు పైఁబడి.)

(అనుబంధము 19.)

[ప్రవేశము—సుమిత్ర]

(అనుబంధము 20.)

కౌసల్య—నాథా! ఇదేమిట్లు మీరామునిఁ గాన పట్టించితివి?

సుమిత్ర—హా! నాథా! నేడేమిదుర్దినము. పట్టాభిషేక మహోత్సవము తుదకీస్థితికిఁ బరిణమించెనే.

కౌస—నాథా! ఏమియుమాట్లాడకున్నావు? ఇట్టివియు వరములగునా! యుక్తాయుక్తములుపరిశీలింపవలదా? అయ్యో! రాముఁడే. సామాన్యపుకొడుకుఁడే. అట్టివానినటవీస్థలికంపని మనసెట్లొర్చెను. ఈసంతాపము నీవైన భరింపఁగలవా? నేనేమి తప్పొనర్చితి? కైక నీకు మెచ్చులాడియైన భరతుఁ బట్టము గట్టుము. కాదనను. నాకొడుకును మాత్రము నాయొద్దనిలుపుమా. నాకుఁభుత్రభిక్షమిమ్మా. నీకునల్గురు కొడుకులున్నారు. నాకొక్కఁడేకదా?

సుమిత్ర—నాథా! రాము నేల యరణ్యములకుఁ బంప? ఈదుఃఖము మన మెవ్వరమైనను సహింపఁగలమా? అయ్యో!

దశ—(లేచియేడ్చి) కౌసల్యా! సుమిత్రా! నాముద్దుకుమారు మనసార నరణ్యమునకు నాజ్ఞవెట్టితినని యెంచితిరా? కటకటా! ఆకొడుకును బాసిన రెండవ క్షణముననే నేశ్మశానమున దగ్ధుఁడకావలదా? ఎట్టిపాడువేళనే నీకైకకు వరముల నిచ్చితి. ఈకైకను చేపట్టికులమువారికందఱికిఁ బుత్రులకు, మీకు శాత్రవుఁడనైతిని. నిన్న సాయంతనమునకు ముందు నేఁ మృతిఁజెందియుండిన నాకీదుఃఖముండదుగదా?

కైకా! కైకా! నినుఁగన్నకడుపు దగ్ధమగుఁగాక.

(అనుబంధము 21.)

కౌస—రాజేంద్రా! నాప్రాప్తి యిట్లుండ నాకైక యేమిచేయును. ఆతన్విఁబిలుపింపుము. ప్రార్థించెదను.

దశ—కైకా! కైకా!

కౌస—కైకేయీదేవీ-రమ్మందు-నేవిన్నవింతు.

కైక—(వెనుకనుండును).

కైక—(వెనుకనుండి) నాకాయాసముగనున్నది. రాఁజాలను.

దశ—కౌసల్యా! దాని నేటికిఁ బ్రార్థింప నెంచెదు. ఏపని చేయవలెనో యదిచేసె. ఇంకేలవచ్చును! జాతికైనఁ గరుణగల్గు-దానికిఁగల్గదు.

ప్ర॥ వశిష్ఠుఁడు-సుమంత్రుఁడు.

వశి—రాజేంద్రా! రామలక్ష్మణులు సీతాసమేతులై వచ్చియున్నారు.

దశ—హా! శ్రీహరీ! (మూర్ఛిల్లును.)

వశి—నేనప్పుడే చెప్పితినే. దుఃఖముతో నేమిప్రయోజనము? ఇది దైవకృతము. వారలఁ బిలుపింపుము—

దశ—ఋషితిలకా! ఇంక మనసు త్రాయుచేసితి. చావనున్న వానికి వగపేల? ఆరాముఁ డుకడమాట నాయానతిఁగైకొనవచ్చియున్నాఁడు కాఁబోలు రమ్మనుము. కడసారి వానిముద్దుమోము వీక్షించెదఁగాక

ప్రవేశము: రాముఁడు-సీత (దూరమున లక్ష్మణుఁడు).

లక్ష్మ—(స్వ) దశరథుఁడుగాని కైకకాని తుదకుఁ గరుణింపవచ్చునని యెంచితిని. ఊర కుంటి-కానీ-ఇంకను వేళగలదు. ఈరాముఁడు నేఁబోయివచ్చెదనని చెప్ప, దశరథుఁ డేడ్వనప్పుడైనఁ గైకకుఁ గరుణగలుగదా? నేనింఁదేయుండెద. ఆవ్యాళమిథునము చేరి యున్న యాగుహాలోనికిఁబోఁజాల. (నిల్చును)

రాము—(దశరథుని నమస్కరించి) జనకా!

దశ—రామా! రామా! నీవునన్ను "జనకా"! యని పిలుచుటెదియేకడసారిగదా?

రాము—జనకా! ఈఅడిల్లము. నీకేటికీవనట? పదునాలుగేండ్లేయని భీతిల్లెదవుగాక శీఘ్రకాలమున నేయవి నిండగలవనుటచింతింపవు. నేసంతోషమున నరణ్యములకేగె దనే నీకేటికీసంతాపము? నీవలఁతజెందిన నేనోర్వఁజాల. నేనిందుండఁజాల. నీయా నతిఁగైకొనకయే వెడలిపోయెద. ఈసీత నాసంతోషము నినుమడింపఁజేసె. నేనెం తచెప్పినను మానక నావెంటనత్తునని పట్టుపట్టె. నేననియ్యకొంటి. మీయాజ్ఞయొక టియేవలయు. ఒంటిగానుండక సతీయుతుఁడనైయుండెదఁగదా? ఇంకేల చింతింప వలయు?

దశ<br>కౌసల్య<br>సుమిత్ర } హా? సీతా! సీతా!

రామ—మీ రిద్దరుగాని దుఃఖించిన నేనిందుండను. ఇదె వెడలెదను.

ద-సు-కౌ-మేము దుఃఖింపము-దుఃఖింపము. (దుఃఖింతురు).

రాము—మాకైకేయి మాతయెక్కడ?

దశ—కైకా! కైకా!

ప్రవేశము: కైక మంథరతో (ఒకప్రక్కన)

మంథ—(కైకతో) నీకున్న ధైర్యమంతయు నిప్పుడే యుపయోగింపవలయు. తిరిగితివా కార్యముదప్పును. (ప్ర) కైకా! నిన్నిందఱుపిలుచుచున్న రాకున్నావు. ఏటికీ మూఖము మూరకరమ్మ.

లక్ష్మ—(స్వ) ఔరా! ఎంతసాహసిని యీమంథర! ఇదియంతయు దీనిపనియా?

కైక—ఏమిపిలిచితిరి?

కౌసల్య—సోదరీ! కైకా! నామాటవాటింపుము. నీకరుణావలోకము నాపైఁ బ్రసరింపఁ జేయుము. నీకొడుకునకుఁ బట్టముగట్టుము. వలదనను. రాము నరణ్యమునకుఁ బంపుటమాత్రము మానుమా? అయ్యో! వాఁడు నీకొడుకు గాఁడా? నీకొడుకునకంటె రామునిపై నీకాదరణము మెండని యెన్నిమాఱులో చెప్పుచుంటివే. ఇది యాయిందుకు నిదర్శనము? నన్ను నాసుతునిఁ బాపి నీవేమి సౌఖ్య మనుభవింప నెంచియున్నావు? నీచేతులంటి వేఁడికొందును. ఈయింత విన్నపమాదరింపుము. జన్మమున్నంత వఱకీయనుగ్రహముమఱవను. కృతజ్ఞనైయుండెద. నను దాసిగా నేలుకొమ్ము. నాకభయమిమ్ము. పుత్రభిక్షమిమ్ము.

(అనుబంధము 22.)

(అనుబంధము 23.)

సుమి—చెలియా! ఈమాటమాత్రముజరుపుము. అయ్యో! నీవు నీయెత్తు ధనముపోసి నను నీయింటికిరాని చెలి నినుఁజేతులంటి వేఁడుచున్నదే. ఏల నీకుఁగరుణగలుగదు. దశరథుకుమారులలో నొకరి నరణ్యమునకుఁ బంపనేవలయునన్న నాకు లక్ష్మణశత్రుఘ్ను లిద్దరున్నారు. వారిలో నొకరిఁబంపుము వలదనను.

(అనుబంధము 24.)

(అనుబంధము 25.)

కైక—రాజేంద్రా! ననిట్లారడిచేయుటకా పిలిచితివి?

దశ—హా! దైవమా! కైకా! కైకా!

కౌస—కైకేయీ! మఱియొక్కమాట. నీకుఁగరుణగలుగదు. రామునరణ్యమునకుఁబంపుము భరతుఁడిందువచ్చువఱకునిలుపు నుపకారముచేయుమా. నేఁడేపంపనేవలయుననునంతటి పగయేటికి?

(అనుబంధము 26.)

ఈపుణ్యముగట్టికొమ్ము కరుణింపుము. కరుణింపకున్న విడువను. నీయానవిడువను. (కాళ్లపైఁబడును).

దశ—కైకా! ఇదిమాత్రమొనరింపుమా. స్వల్పకార్యము. నీవు రెండుగాదింకెన్నివరములైన నడుగుము. ఇచ్చెదను. దీనిమాత్ర మాచరింపుమా. నినునమస్కరించి వేఁడుదు.

[కాళ్లపైఁబడును.]

కైక—(మంథరను జూచును)

మంథ—(వలదని సైగ చేయును)

కైక—రాజేంద్రా! పతులారా! ఏమిసొగసు మాటలేయివి? భరతుఁడువచ్చిన వాని లోఁబఱచుకొనినను జెడ్డజేసి దేశభ్రష్టగాఁ జేయనెంచితిరా? నను గాడిదెపాలుపోసి పెంచి నారనుకొన్నారా. రాజేంద్రా! ఈహాయాళితనములేటికి? ఇందఱియెదుట నన్నాఱడిచేయుచున్నారా! వరము లీఁజాలననుము. తీఱినదిగదా?

(అనుబంధము 27.)

చం॥ భరతుఁడు వచ్చెనేని కడువంచన లోఁగొనివాని రామునిన్ ।
ధరణికి నిల్పనెంచితిరె దాని నెఱుంగఁగఁజాలనే విధం ।
బరయని గోలనేయకటయంతటిమోసమెనాకు లేదెనా ।
గరికతనాడు తల్లినను గాడిదెపాలిడి పెంచియున్నదే?॥

అందఱు—హా! శ్రీహరీ!

లక్ష్మ—(ఖడ్గమువట్టిలోనికివచ్చి)

(అనుబంధము 28.)

సదస్యులారా! చూచితిరిగదా? ఇందలిధర్మముల మీరాలోచింపుఁడు. వరములనగా నెట్టివి? తనకు మేలుగాఁ గోరునవికదా? బ్రహ్మాదిదేవతలఁ గూర్చియెందఱు తపములొనరింపరు! ఎందఱువరములఁగోరరు. తమకిట్టిమేలు ఇట్టిపదవిరావల యునని కోరిరిగాక పెఱవారికిట్టు దుఃఖముగల్గ వలయునని వరములనడిగిరే? కాఁబట్టియీ కైకేయి రామునరణ్యమునకుఁ బంపఁగోరినది వరమేకాదు. దానిఁ యధిపుఁ డివ్వఁబనిలేదు. అదికాక, ఈమెకు రెండువరములకుఁగదా స్వాతంత్ర్యము? రెండడుగునెపమున నీమె యెన్నివరముల వేఁడినదో విచారింపుఁడు. ఒకటి భరతునకుఁ బట్టాభిషేకముచేయుమని. దీనితోనే రెండునుఁ దీఱె. ఇంత సఱకు రాముపట్టాభిషేకము నిశ్చితమైయుండినందున, దానిమాన వలయునని యొకటియు, భరతునభిషిక్తుఁ జేయవలెనని మఱియొకటియునగుఁగదా? ఇంకనిఁ ఁడిగిన వరమెక్కడిది? కావున నెట్టివరమును ధరాధిపుఁడీఁ బనిలేదు. పాటింపఁబనిలేదు. ఈరెండపదిశనువరమునను యెన్నియున్నవో చూడుఁడు తపసివృత్తిమై, పదునాల్గేండ్లు, అరణ్యముననుండ రాముని నేఁడే పంపవల యునఁట. అరణ్యమునకు రాముఁ బంపవలయుననుట యొకటి, పదునాల్గేడ్లుండఁ బంపవలయుననుట యొండొకటి, తాపసి వృత్తిగలిగియుండవలయుననుట యిం కొకటి. నేఁడేపంపవలయుననుట మఱియొకటి ఇట్లు నాల్గువరముల నడిగినది. దీనినన్నిటి నీరాజేంద్రుఁ డివ్వవలయునను నిర్బంధమేమి! ఏవియొట్లిచ్చినను, నేఁడేపంపుమని నిక్కచ్చి చేయుట యెట్లగు? భరతుఁడు వచ్చువఱకు నిలుపు మని యీమెను వేఁడుకొనే నేల? అవశ్యమునిలుపవచ్చును.

వశిష్ఠ—భళిరే లక్ష్మణా! నీవింతయొప్పిదముగ మాటలాడుదువే?

సుమం—ఈయుక్తి యొకరికినిఁ దోఁపదయ్యెఁగా?

రామ—మీరేలసంతోషించెదరు. వరములుకానీ కాకుండనీ తల్లియడిగినద్ది తండ్రియిచ్చినాఁడు. నామేనఁబ్రాణములుండనే నతని నసత్యవాదిఁజేయుదునా? ధర్మసూక్ష్మవాదమున కేమివచ్చెను. నేఁబోవనేవలయు.

చం॥ వరములఁగోరెఁదల్లి జనవంద్యుఁడుతండ్రియొసంగెఁగానకే।
నరుగఁగఁదమ్ముఁనిక్ గృపధరాధిపుఁజేయఁగనాకుఁదీఱునే।
వెరవునఁదండ్రిమాటనడుపింపని పుత్రుఁడుపుత్రుఁడేగుణం।
బరయనిధర్మసూక్ష్మముల నాడఁగనేల వృథావివాదముల్॥

లక్ష్మ—రామా నీకెంతటియవివేకము! అశక్తునిభంగి నిట్లుమాటలాడనేల? నీవరణ్యముల కుఁబోవనేల? తండ్రిమాటజరుపనేల? తండ్రియఁట! వాక్యమఁట! ఇట్టి తండ్రిమాటయా జరుపవలయు. ఈతండ్రియే వశిష్ఠాదిసంయములును సుమంతాదిమంత్రులును, నిండిన యొడ్డోలగమున మొన్న నినుఁబట్టాభిషిక్తుఁజేసెదనని నీకు మాటయీలేదా? ఆమాట నెట్లుతప్పఁజాలువాఁడు? అదిత్రిప్పిన యసత్యములేదఁట. ద్రోహకాంతచేసిన యొకభోగిని కన్నితరములక్రిందటనో యెవ్వరు నెఱుంగకుండయిచ్చిన యవివేకపుమాటతప్పిన సత్యభంగమఁట. ఎట్లును నీతనికసత్యపాపమేరానుండ వరణ్యముల కేలపోయెదవు? నీబంటునేనుండ నీకేమికొఱఁత. ధనువుపట్టినిలిచిన నెవఁడడ్డమురాఁగలఁడు? సప్తసాగరములఁగలఁచి వైవఁజాలనా? కులాచలముల వ్రక్కలింపఁజాలనా? రామా! ఈపురివిడిచి ముందొక్కడుగిడకుము. మదనాతురుఁడై వృద్ధుఁడై క్రూరకర్మములకోర్చిన యీదశరథు మాటలేలవినవలయు. నాచేతులార నీకు నేనపట్టాభిషేకముచేయఁగలను. ఈకోశేయకముపట్టి నిలిచి భరతాదులగు శత్రువర్గములఁ బరిమార్చెద. ఏయసతీసుతుఁ డడ్డమువచ్చెడినో చూచెదము. ఈ దుర్జాతిమంథర కలదుగదా? దీనిసిప్పుడే (కత్తియెత్తిపోవును.)

కౌసల్య—లక్ష్మణా! (అనినిలిపి) ఈ మంథర నిరపరాధిని నేనెఱుఁగుదు. దీనిఁగనకుము.

రామ—లక్ష్మణా! లక్ష్మణా! ఎంతమాటాడితివి? ఎట్టిపాపము గట్టికొంటివి! కోపము నఁగలిగిన యనుతాపమున నరకరూపమునఁ బడిపోవుట రయ్యవేతివే

(అనుబంధము 29.)

ద్రుతవిలంబితము. తగునెనీతలిదండ్రుల నగ్రజుక్।
పగవుఫుట్టఁగఁ బల్కితిటిట్టులక్॥
మిగులనిన్ను సుమిత్రయ కాంచెనో।
పగఁగిరాతక బోలునె పెంచెనో॥

ఎవ్వరినింతగా నీవాడునది? దశరథునా? తండ్రియే. కైకేయినా? తల్లియే. భరతునా? అన్నయే. పితరులగుటెంచి యున్నగజుఁగూర్చియు నిట్టాడినపాపమునకు నీకెట్టి ప్రాప్తి ఘటింపఁజాలదు! నీవు సుమిత్రకన్న వాఁడవనితోఁపదు. ఎందో శబరికి రాతకులంబున నుద్భవించి దుష్ప్రాప్తిచే నిన్ను సుమిత్ర పెంచినట్లు తోఁపఁజేయుచున్నావు. నీతో సంభాషించిన దురితముగాదా.

తోటకము. తలిదండ్రులనగ్రజుఁ దాలిమిలే |
కలయించెదుపాపము లాడితివే |
బలుకోపము దెవ్వరిపై ననికే |
న్దిలకింపఁగఁ బోపము నీముఖముక్ |

లక్ష్మ — [కత్తిపాఱవేసి] అన్నా! రక్షింపుము. కోపమున నరయలేనైతి. బ్రహ్మహత్య పాతకమునకు గుఱియైతి. [కాళ్లఁబడును.]

రామ — [లేవనెత్తి] ప్రియసోదరా! నీకుబుద్ధిగలుగుటకై క్రూరపుమాటలాడితిఁగాక నీసుస్వభావము నెఱుఁగనా? నన్నేల క్షమింపవేఁడెదు. నిను క్షమింపవలసినవారు నీపితరులుగదా?

(అనుబంధము.)

లక్ష్మ —

జనకా! మహాశాంతగుణోపేతుఁడవగు నీకుఁబుత్రుఁడననుపించుకొని యొడలుదెలియకుండఁగాల్చిన కోపమునకులోఁబడి నిన్నూరకదూఱితి. ప్రాయోపవేశమొనర్చి నను ఈపాపము నాకుఁదప్పదు. రక్షింపుము. (దశరథుకాళ్లపైఁబడును.)

దశ — తనయా! నీవేమంటివి? నీమాటలన్నియు యథార్థములు. నేఁగామాతురుఁడఁగాన నే యీ కులనాశకరి కీదుర్జాతికి వరములిచ్చితి. క్రూర కర్ముఁడఁగాన నే యింతటికోర్చితి. నేనవశ్యము వధార్హుఁడ. నిచేతఁగాకున్న వేఱొండు భంగినైనఁ జావఁగలవాఁడ. ఏల వెనుదీసెదవు. ఇదె నాకంఠము, అదే నీకరవాలము. (ఏడ్చును.) నీకేమియుఁ బితృవధ పాపముకలుగకుండ దైవముం బ్రార్థించెద-కానిమ్ము.

రామ — అయ్యా! ఇటుదగునా? వీఁడు ప్రజ్ఞలేమి నిట్లాడెనింతర్గా. అవశ్యము క్షంతవ్యుఁడు.

దశ — రామా! నేను కోపమునఁ గార్పణ్యమున మాటలాడితినా?

లక్ష్మ — జనకా! నీవు క్షమింపకున్న నీకరవాలమున నాజిహ్వ — (ఎత్తును.)

దశ — (నిలిపి) పుత్రా! నివొనర్చినది యపరాధమే యని యెంచిన క్షమించితి. నిక్కముగా క్షమించితి.

లక్ష్మ—మనసారఁ గరుణించినందుకు నిదర్శనముగా నాకొక్కవరము నీవలయు.

దశ—అయ్యా! నావరములు నన్నేగతికిఁ దెచ్చె చూచియున్నాఁడవు గదా? అయినను ప్రియకుమారునికీఁ దగని వర మేది. అడుగుము.

లక్ష్మ—ఈ రాము వెంట నన్నుఁబోవ ననుజ్ఞ యీవలయు. ఇదియే నా వరము.

సుమి—కుమారా! లక్ష్మణా! నీవు నాతనూజుఁడ వైనందుకు సార్థకమిప్పుడుగదా? సుకుమారుఁడగు రాముఁడు సుమ కోమలాంగియగు సీతతో నరణ్యముల కేగుచుండ వారికి రక్షగా నీవుపోవ వేఁడవలయుననియే యుంటి. అది నీవకోరితివి.

రామ—లక్ష్మణా! ఇదియేమి కోరిక—

లక్ష్మ—నేను వెంటరానను గ్రహింపవలయు. (నమస్కరించును.)

రామ—తమ్ముఁడా లెమ్ము. నీవైయాదర పూర్వకముగ వెంటవత్తునన్న నే వలదం దునా? నాకుఁ జతుర్భుజములు కావా నీవుండిన? జననీ జనకులారా! ఇంక మా కాజ్ఞయిండు. పుత్రుల స్వల్ప వియోగము గలిగెనేయని వంతఁగుందకుఁడు. నార చీరల నిండు.

కైక—(మూఁడు జతల నారచీరలు నొక జత దారుపాదుక లిచ్చును.) కుమారులారా! ఇవిగో చీరలు కొనుఁడు.

సుమం—(స్వ) ఇట్టి పాపిజాతి యిట్టి కఠినమానసలోకమున లేదుగా.

దశ—హా! హా! శ్రీహరీ!

వశి—కైకేయీ! చూచి చూచి యోర్చితిమి. ఇంకెంత యోర్వగలము. ఆ కేక యరాజునకీ వెట్టివేళ జనించితివి. నీదుష్కృతివలన ఫలమేమైన నున్నదని యెంచితివా? భరతునికైకదా నీవింత కటిక పనిచేసినది ఆ భరతుఁడు నిన్నాద రించునని నమ్మితివా? నీవుగడించిన యీనీచ సింహాసనమునఁ దన వామపాద మైన వాఁడూనునని యెంచితివా? ఆభరతుఁడెవ్వఁడని యెంచితివి. వాఁడు శ్రీరా ముని దశరథు ప్రతినిధిగాఁ జూచువాఁడు. అతనిమాట నింతయైన మీఱనివాఁడు. తనయన్న కిట్టిపాటుగలిగెనన్న వెతఁజెందకుందికందడా? వాఁడు దశరథునికొడుకె యైన నినుఁదనతల్లిగా భావించునా? నీపాపపుమోము మరలఁజూచునా? అయ్యో ఈ సుకుమారులకు నారచీరలివ్వ నీచేతులెట్లాడెను?—

దశ—హా! కైకా! రామునికి నీవు తపసివేషముగోరితివిగాక సీతకు లక్ష్మణునకుఁగో రితివా? లోకవిదిత పాతివ్రత్యవిఖ్యాతయై, పుణ్యగుణోపేతయై, అనవరత సద్వ్రత సమేతయై, తగు సీతకాయిచ్చితి వీనారచీరలు? తెమ్ము నామణిభూషణసందోహ ము. ఇల్లంతయు నూడ్చితెమ్ము. సీతా! కోమలముఖకంజాతా! సుగుణవ్రాతా! కొమ్మిమ్మభూషణముల పాఱవేయుమా నారచీరల (తానే పాఱవేయును.)

లక్ష్మ—జనకా! నాకివియే యుండనిమ్ము (తెరబడును.)

---

# పాదుకా పట్టాభిషేక నాటకము.

## ద్వితీయాంకము-తురీయరంగము.

ప్రవేశము: ఊర్మిళ, లక్ష్మణుఁడు.

(అనుబంధము.)

నాథా? నన్నెడబాసిపోవ నేనేమి నేరమొనరించితి. ఏమిచేయరానిది చేసితి. అయ్యో! పరిణయము నాఁటినుండియు నొకనాఁడు నీదండనుండని నాఁడెఱుఁగనే. అట్టిచోఁ బిట్టపిడుగున నీకీబుద్ధిపుట్టుటెట్లుఘటిల్లె. ఆహా! తెలిసెను. నిన్నరాత్రి నే ప్రణయకోపమున నిన్నుమాని యొండెనిఁయుంజనెదననియు నాయెడకు నిన్ను రావలదనియునంటినే. అదియే యొక కారణమాయెనే. ఇట్టిప్రణయము లెన్ని నీవు మన్నింపలేదు. నిన్ననెట్టిపాపపువేళ. అయ్యో! నాపాపపునోరు నిన్న నెంతమాటాడనేర్చెను. ప్రాణేశా! నాలుగుదినముల క్రిందట నిట్లనేనంటినే నింకనెన్నియో విరసములాడితినే. నాఁడులేనికోపము నేఁడేలకలిగె. ఆకోపము నిప్పుడు కలిగెఁగాక నిన్న లేదయ్యెనే. అప్పుడు నేఁబాసిపోయెదనన్న బిగువారఁ గాఁగలించితివే. నాయొద్దకురావలదన్న రానుగాని యీముద్దుమాత్రము మాననని ముద్దాడితివే. కోపమునుమాన్చినగించితివే. ఇట్లుచేయుటకా? మనసున సంతపగ పట్టి యిట్లుమోసముచేయఁగలవని యొకనాఁడు నేనెఱుంగనే. మనోనాథా! నేనెట్టియపరాధ మొనర్చియుండినను మన్నింపుమా. కరుణింపుమా రక్షింపుమా లేదేని నను(ఁ)జంపుమా—(కాళ్లఁబడును.)

లక్ష్మ—ఊర్మిళా! నన్నేలయిట్లుబాధపెట్టెదవు. ఏలనాకు మిగులఁజాలమియొనర్చెదవు. అయ్యో! నీవు నాదండయెట్లుండఁగలవు. యెట్లు భీతిలేక గహనసీమలకాలము ద్రోయఁగలవు.

ఊర్మి—నాథా! ఏలయీమాటలు. రామువెంటఁబోవుటకై మాయక్క సీత ప్రార్థింపదో అతఁడేమైననీవలె రావలదనెనా? రామునికి కరుణయును నీకు కోపమును స్వాభావికగుణములని జనులెల్లనందందనుకొందురు. అదికల్లయని యెంచియుంటి. ఇప్పుడు గదా నిదర్శనమయ్యె. ఆయ్యో! ఆసీత యేవనావాసమునకోర్చిన నాకేమగు.

కందము॥ సుకుమారిధరాసుతకే।

ప్రకటాటవులఁ జరించు భంగికలిగిన।

న్నిఁకనాకేభయమెట్లగు।

నకటా ప్రాణేశయింత యారయవలదే॥

లక్ష్మ—ఊర్మిళా ! ఆసీతా జననిపోవుచుండ నేగదా నేను వారిరువురకై పయనమైతి. నేనునురాముఁడునుండి యామెను రక్షించుకొనఁగలిగినఁ జాలుఁగదా. ఇంకనీవున్న మాకత్యంతము ప్రయాసమగు కామినీ ! నామాటనమ్ముము. నీపైనెంతరైయైన నాకుఁ గోపముగలుగునా. ఇదిగో సీతాదేవి వచ్చుచున్నది ఊఱడిల్లుము నేనావలనుండెద.

[నిష్క్రమించును.]

[ప్రవేశము: సీత.]

ఊర్మి—అక్కా ! సీతా! నానాథునికి నాపైఁగరుణ లేదు. నీవైనఁగరుణింపకున్న నేనసువులఁ భరియింపఁజాల రామునివేఁడుకొనియైన నేవచ్చుటకు సమ్మతింపఁజేయుమా.

సీత—చెలియలా ఇట్లేల.

కం॥ రాముఁడు నేఁబోయెదమా ।
సౌమిత్రియువచ్చునెవరు సలిపెడువారల్ ।
కోమలిశుశ్రూషలుమన ।
మామకునత్తలకు నింతమదిఁగనవలదే ॥

తరుణీ ! నీవింత యోచింపవలయుఁగదా మనమెవ్వరులేకున్న నిండ్లుండును ?

ఊర్మి— అక్కా ! ఈమాటలేలపల్కెదవు ? రాజరాజాంగనలకు మముఁబోలువారి శుశ్రూషలేటికి ? అదిగాక యింతలోననే మాండవీశ్రుతకీర్తులు వత్తురు. నేమానను. నీవెంటరాకమానను, నాపతి వెనువెంటఁ బోవకమానను.

సీత—చెల్లెలా ! నీవట్లాడిన మేమేమనఁగలము. నీవు వంతఁజెందిన నాకేమియుఁ దోఁచదు.

(అనుబంధము 33.)

సీత—నేను నీకింత చెప్పఁజాలను. చెల్లెలా ! నీవు రాఁగూడదని నాకేమియునఁ గోరికయా ? అవశ్యము నీపతియానతిపె రన్ముు ఇదెపతివచ్చె-నేఁబోయెద.

(నిష్క్రమించును.)

(పునఃప్రవేశము—లక్ష్మణ—)

లక్ష్మ—(ఊర్మిళ నాలింగనముచేసి) సతీమణీ ! నీవంత నేఁ జూడఁజాల. నీవువచ్చిన నాకు దుఃఖము. నీవిందున్నను దుఃఖమే. ఇదియెట్లయిన భరింతు. ఆరాముఁడు నీకు నాకు నెల్లవారికిని రాజేగదా? అట్టివానికి భృత్యుఁడనైనేఁ బోవనీవు నావెంట

వచ్చిననెంతయు సంతాపకరముగా నుండును. మానుము నేవేఁడికొందు. నేవిన్న వింతు. నాయాన నీమతము మానుము. నీవుమానకున్న నేనింఁదేదైన నుందుఁగాని నినుఁబిలుచుకొని పోవఁజాల-చాల-చాల-నేఁజాల-నాకగు ప్రతిజ్ఞాభంగమున కోర్చె దవో-లేక యొుక కొన్ని దినములు నేనిందుండకుండుట కోర్చెదవో నీవేయాన తిమ్ము. నను మన్నింపుము.

ఊర్మి—నాథా! నీయానకు నేను మారువల్కు దాననా-వియోగతాపము సహింప కిట్లాడితిఁగాక ఇంక నేనేమనఁగలను. నీకే భంగమునువలదు. అన్ని భంగములు నాకే యుండనిమ్ము. ఆసీత నోచినపుణ్యము నోచియుండవలయుఁగదా? ఆమెసంతోషము నాకెట్లబ్బును. ఉండెద నిందేయుండెదను. ఎట్లోయుండెదను విచారింప కుము.

లక్ష్మ—కామినీ! నన్నేలయిట్లు లాఁతిగాఁ జూచెదవు. నీవు శుభముగ జయశబ్దములాడిననుఁ బంపకున్న నే ముందొక్క డుగిడను.

ఊర్మి—హా! దైవమా! నాకింత ధైర్యమిమ్ము.

(అనుబంధము 34.)

నిష్క్ర-౧.

(తెరయెత్తపడును.)

[ప్రవేశము-రామ-లక్ష్మణ-సీత,] నమస్కరించి.

---

రామ—తలిదండ్రులారా! మాకింక నాజ్ఞయిందు. జనకా! ఈకైకేయి మాతను మీరు నిరాదరణ మొనర్పరాదు. నాకహితకార్య మీమె యేమియునొనర్పలేదు. ఆయమ నొక్కింతయు నోనాడవలదని ప్రార్థించుచున్నాను. ఈ కౌసల్యా సుమిత్రాదేవులు పుత్రులు దండలేకుండుటఁజేసి వగచుచుందురు. వారల చింతవారింప వలయు. తంఁపు భరతుఁడేతెంచిన మా నాందీవాదములవచింపుచు, రాజ్యముగైకొనుటకు వాఁడేమైన సంకోచించిన మనఃపూర్వకముగ నేనొసఁగెదననియు పరిపాలింప వలయుననియు వచింపుఁడు. అమ్మలారా! మాజనకునిపై నించుకైనఁ బరామరిక తప్పకుండవలయు. అతఁడు వృద్ధుఁడు. ఊరక నాకొఱకై చింతబూనినాఁడు. మీభక్తిశ్రద్ధల నతనిచింత యుడిపి పాలింపవలయు. భరతునిఁ గరుణింప వలయు. వాఁడు మీయెడలఁ బరమభక్తిపరుఁడు. మామాఱుగ మీాదండనుండు వాఁడు. ఇంకానతిందు.

దశ—రామా! అట్లయినఁ బోయెదవా? ఇదియె నీకడచూపని నాకుఁ దోఁచుచున్నది.

రామ—జనకా! ఆమాటలనకుము. మమ్మాశీర్వదించి శుభముగఁ బంపుము. కన్నీరు నింపకుము. ఇదె నమస్కరించువారము. (నమస్కరించును.)

లక్ష్మ— (నమస్కరించును.)

దశ—పుత్రా! అయినఁ బోయెదవా? నాయత్నములేదు.

సీసపద్యము॥ కులశేఖరుననినిన్ను ఘోరాటవులకు నేఁ
డనిపితిననినన్నుఁ గనలకన్న।
కైకపాపముగాక గలుగదునాపాప
మించు కంతయునంచు నెంచవన్న।
మిఱుఁజాలమిఁజేసి మితిమీఱికలిగెనీ
యిమ్మల మనినీవు నమ్మవన్న।
సడలించు శోకంబు సాక్షిచాలకయున్న
నేఁ జచ్చినపుడైన నెఱుఁగవన్న।
మగువ నీసీతపనుల నేమాఱకన్న।
పిన్నతమ్ముని గరుణచేఁ బెంపవన్న।
మాతలనునన్నుఁ దమ్ముల మఱవకన్న।
భూరియశమున మఱిపురిఁ జేరవన్న॥—

కైకేయి క్రూరఁపుఁ దలంపునఁ గుణభూషణుఁడవగు నినుఘోరారణ్యముల పాలుచేసి తీఁగా యనినన్నుఁగనలకుము. ప్రాప్తము నెవరు తప్పింపఁజాలుదురు? కటకటా! హంసతూలిక పాన్పుపైనుంచినను, కందువాఱెడు లేమేను గులకరాళ్లపై నెట్లుండునో? ఎండకన్నెఱుఁగని సౌధములనుండినను కసిగందుమోముఁ దమ్మివర్షాతపములకెట్లోర్చునో, మెత్తనిచిత్రాసనముల ద్రొక్కినను గ్రొన్నెత్తురుబ్బు పదములరణ్య కంటక శిలాప్రదేశముల నెట్లుసంచరించునో? నేనేమని యేమి ప్రయోజనము? ఈ సీతా లక్ష్మణులు నీపైమోహమునఁ బాయక చనుదెంచెదరు. వీరిఁ జక్కఁగా నరసికొనుము. ఈసీత సుమకోమలి, ఆకాఱడవుల నెట్లువర్తింపఁ గలదో? అల్లయకుండఁ గాపాడవలయుసుమా. సీతా! నీపతి వెంటఁ బోవు పాతివ్రత్యమునకు మెచ్చితి, మీఁరుపోవు విపినంబుల భీకరమృగములును, రాక్షసుల నెలవులు నుండఁగలవు. నిర్భయముగాఁ దిరుగాడకుమా. వీరిరువురిలో నొకరు వెంటరాక యొందునుఁ బోకుము.

పృథ్వీవృత్తము॥ పురాకృతముదప్పునే పొగులకమ్మనీకైనయీ।
కరాళగతికిన్మమున్ననల కమ్మయెందైననా।
యరణ్యములనొంటిగా నరుగకమ్మనిర్భీతిగా।
మరాళగమనామమున్న అవకమ్మయోకోడలా॥

కుమారీ! పోయిరమ్మా.

మంధర—(కైకతో) ఇంకమనము పోదమురమ్మా. అప్పుడే నీవేడ్పు మొగము పెట్టితివి. ఏమిచేయుదువో—

కైక—నేనురాను. నేనేమియుఁజేయను-నీవేపొమ్మా.

రామ, సీత, లక్ష్మ—(కౌసల్యకు నమస్కరింతురు.)

కౌసల్య—రామా! నీరమానసమునంతయు పర్యాలోచించి చూచియున్నాను. అన్నా! పోయిరమ్మా. ఈలక్ష్మణుని సీతను యేమఱకుము. వీరినరయునెడ నెంతశ్రద్ధయున్ననుఁ దక్కువేయగు-(రాముని తల నివిరి యాలింగనముచేసి) రామచంద్రా! దేవతలు, ఖేచరులు దిక్పాలకులు, చంద్రుడు, సూర్యుఁడు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు, పృథివ్యాది పంచభూతములు, శ్రుతులు, శాంతిదాంతులు, యతులు, నదులు, తరులు, గిరులు, దశదిశలు, సమస్తజీవరాశులు, సప్తాధోలోకములసప్తోర్ధ్వలోకములనున్న ప్రాణిసందోహము నీకెప్పుడు క్షేమముగలిగింతురుగాక! (చేతికి రక్షగట్టి,) రామా! దీనిఁబాయక రక్షించుకొనుము. అలనాఁడు తనతల్లి దాస్యముఁదీర్ప నుద్దేశించి సర్వప్రయత్నముల దేవతలజయించి దేవలోకమునుండి యమృతముఁదెచ్చుట కుద్యమించి మ్రొక్కి యెదుటనిలచిన గరుత్మంతున కాతనితల్లి యెట్టిదీవనలొసంగెనో ఆ దీవనలు నీకుఁగలుగనిమ్మా. అజేయుఁడై సర్వాయుధాభేద్యుఁడై సురలఁబాఱఁదోలి సురపురి నాక్రమించియున్న వృత్రాసురుఁజంపు నుపాయముఁగానక తొల్లి దేవేంద్రుఁడు విష్ణువులన ననుజ్ఞవడసి సర్వసామగ్రుల సమకూర్చికొని ఋషిప్రముఖులగు దేవతలకు మ్రొక్కి నిలిచి వృత్రుపైఁ బోవుట కనుజ్ఞవేఁడగా, ఆ దేవతలాతనికే మంగళముల నిచ్చిరో యా మంగళములు నీకుఁగానిమ్మా. మఱి బలిదానవనేత దేవేంద్రుని స్వర్గమపహరించి యలఘులీలఁ బాలింపుచుండ, ఇంద్రుని స్వత్వ మింద్రునకుఁ జేర్పునుద్దేశమున జనించిన వామనమూర్తి - బలీంద్రుధరాదానమడుగఁగోరి యటకుఁబోవ నాతని వేఁడి తనతల్లి యదితికి మ్రొక్కి నిలువఁగా రాజ్యభ్రష్టులై కడుహీనస్థితినున్న యింద్రాదిసుతులఁ గాపాడికొనుచు గహనాంతరసీమల నిరుపేదభంగిఁగాపురమున్న యామదితి యా వామనునకెట్టివిజయములఁగోరెనో యావిజయములు నీకుండనిమ్మా. తనూజా! పోయిరమ్మా లక్ష్మణా!

శా॥ అన్నాలక్ష్మణనీవు ఘోరాటవుల నాహా యెట్లుకాపాడఁగా
నున్నావోరఘురాముఁగోడలిని నిత్యోత్పాతముల్మ్రొచ్చినీ
వున్నావంచుఁదలంపనూఱటయు నాకొక్కింతచూపట్టెనా
కన్నుల్బల్లనఁగావధూతనయ భిక్షంబిచ్చిమన్నింపవే ॥

నీవు రాముని వెంట నేగెదవను కారణమునఁగదా ఇంతధైర్యమువహించియున్నాను. నీయన్నను వదినియను నిష్ఠురాటవుల బాధలొందనీక మరలఁబురముజేర్చితివా నాకునీవ పుత్రపుత్రీదానమిచ్చిన వాఁడవగుదువుసుమా. సీతా! ధరణీజాతా!

సీ॥ మితభాషణములాడు నతివమాటనుసొంపు
నింపునీమాటలాలింపనైతి ।
మిగులఁజూచినదృష్టి దగులునోయనుభీతిఁ
గన్నులారఁగనిన్నుఁగాంచనైతి ।
చిఱుతసిగ్గుననీవు చేరరాకుండుట
నింపుగానినుఁగౌఁగిలింపనైతి ।
సుతనుమించినకూర్మి యతివయోకోడలా
కడఁగినీశుశ్రూషఁగాననైతి ।

తే॥ గీ॥ బాలనిను నేఁడుగానలఁ దోలుటాయె ।
నెటుల వేఁగింతునమ్మ త్రోయింతునమ్మ
వంతఁజాలింతునమ్మ తలంతునమ్మ ।
యెంతునమ్మ ప్రాణముల భరింతునమ్మ ॥

చక్రవర్తికుమారుఁడనియు, చక్రవర్తిపదమునకు రాఁగలవాఁడనియు, నమ్మి జనకుఁడు నిను మారామునికిచ్చెను. ఎల్లప్పుడు నినుగారాముగాఁబెంచిన మిథిలానాథుఁడు నిన్నుఅచేతనిడికొని కాపాడి తనయట్టివారిగా భావించి నినుమాకోడలిఁజేసెను అట్టి నిన్నుగట్టులఁబట్టించి జనకరాజున కెంతయునపరాధమొనర్చితిమి. ఇప్పుడ తనిమానసమెట్లుండఁగలదో విధిబలముచేనైన యీకార్యమునకు మమ్ముఁగనలకుమా? నిన్నుఁబొమ్మనఁజాలము. పోవలదనఁజాలము. పరమసుస్వభావముననుసముచితసాధ్వీగుణంబునను, ధీరపతివ్రతవై నీపతివెంటఁ గానలకేగుటయే విహితము. సముదంచిత సతీగుణసముపేతయగు నిట్టికోడలు మాదండనుండుటకు నోఁచమైతిమి. మాసంతాసమాదైవమేయెఱుఁగు. ఏట్లునుపోఁవనున్నావు పోవఁగలవు పోయెదవు ఎట్లయినఁ జింతమాన యత్నింపుము. పతివ్రతాతిలకమగు నీకు నేఁజెప్పవలసినధర్మములేమున్నవి? జనకుఁడు నిన్ను మావశముచేసినదికల్ల. నాయిరువుర ముద్దుకుమారుల నీవశమిప్పుడు నేఁజేయుటయదార్థము. వీరలనెట్లరసెదవో. వేళవేళకు భోజనమిడివలసినయుపచారములఁజేసి యెట్లురక్షించెదవో, పూజనీయురాలవై మరల సౌఖ్యముగ నీపతితో మఱదితో మావీఁటి కరుదెంచినాయాశీర్వాదము నెట్లుపడసెదవో. సీతా! మిథిలాపురినుండి తెచ్చితివే ముద్దుచిలుకల వానినెందుంచిపోయెదవు. నీయాఁకలిరైయైననుమాని వానినిఁ బోషింపుచు వచ్చితివే అరణ్యముల రామలక్ష్మణుల నట్టిచిల్కలేయని యెంచుమా. అమ్మరో పొమ్ము. ఈపదునాల్గేండ్లు మమ్ము మఱవకుము. అక్కటా! కాదు మఱచిపొమ్ము. (ఏడ్చును)

దశ—హా! నిర్భరము. సతీమణులారా! మీరందఱుఁ బయనముకండు. సుమంత్రా పురి వారినెల్ల నరణ్యమునకుఁ బ్రయాణము గమ్మనుము. చతురంగబలములతో సర్వసంపదలతో నేనుంబోయెద. ఈ పాదూరు భరతుఁడేలెడుఁగాక. ఈ విధవయు—

కైక—

మ॥ ధరణీపాలక నేవరంబడుగ సాంద్రఖ్యాతిఁ బాదూరికి।
న్భరతుం బట్టముగట్టనిచ్చితివె నీపాండిత్య మింసాయెనా।
వరమీలేనను మింతయేలసుతుతోఁబల్కానకుం బోయెదర్।
ఇరవారంగసుఖంబుగామనుఁడు నీయిల్లాంగ్రడుమీరందఱుర్॥

రాజేంద్రా! పాదూరికా నీవు భరతునిఁ బట్టముగట్ట వరమిచ్చినది. వరములే యివ్వననుము. నీయాంగ్రడతో నీవే సుఖముండుము.

దశ—హా! దైవమా!

రామ—లక్ష్మ-సీత— (నమస్కరింతురు.)

సుమి—తనూజులారా! కోడలా! నేనేమి వచింపఁగలను. అన్నా లక్ష్మణా!

తే-గీ॥ తనరదశరథుఁగా రాముఁదలపవన్న।
ఎలమిసీత "మాయమ్మ" యంచెంచవన్న।
ఆయరణ్య మయోధ్యఁగా నరయవన్న।
సుఖము దీపింప మఱినన్నుఁ జూడవన్న.—

పతివ్రతా తిలకమై, శాపానుగ్రహ సామర్థ్యవిరాజితయై యొప్పు కౌసల్యాదేవి మంగళాశాసనములుండ మీకేమికొఱఁత.

రామ—కైకేయి మాతా! నీవు మమ్మాశీర్వదింపుము.

దశ—హా! హా! వలదు. వలదు. ఇంత యాశీర్వాదమే చాలదా!

కైక—వరములిచ్చువారిం గంటిమి. ఇంత యేడ్చువారిఁజూడము. (నిష్క్ర)

(అనుబంధము 35.)

రామ—వశిష్ఠసంయమీంద్రా! మాకనుజ్ఞయా. (నమస్కరింతురు.)

వశి—రామా! నిన్ను నేనేమాశీర్వదింపఁ గలను. నీవెందున్ననదియే పరమస్థానము. దుష్టనిగ్రహమును, శిష్టానుగ్రహమును నిర్జరామోదవిభూతియు, శాత్రవపఙ్క్తి కంధర హరణ విఖ్యాతియునీకు సిద్ధించుఁగాక.—

రామ—సుమంత్రా! ఇంకపోదమురమ్ము—

రామ—లక్ష్మ-సీత-సుమంత్ర— (నిష్క్ర)

దశ-కౌ—, సుమిత్ర— } హా! మాభాగధేయము. మా జీవరత్నముపోయె. (మూర్ఛిల్లుదురు.)

ప్రవేశము-పౌరులు—(తాయి-పౌరక మొదలైనవానితో) విధవయు.

(అనుబంధము 36.)

పౌరులు—ఆదుర్జాతికైకయేది? ఆపలుగాకి మంథరముండయెక్కడ? ఆయవివేకిదశరథుఁడేఁడీ?

కౌస—పౌరులారా! ఏమిట్లువచ్చితిరి?

పౌరు— ఆమంథర విధవయేది? పలుగాకికైకయేది? అడచెదము పొడిచెదము తాఁతఁగొట్టెదము గుండువేసెదము పౌరకతోఁగొట్టెదము.

దశ—పౌరులారా! అఘోరపాపుఁడ నిందేయున్నాను.

పౌర—మొత్తు-తన్ను-కొట్టు-చంపు-

1. పౌర—ఈరాజునేమిచేసి యేమిప్రయోజనము? వరములిచ్చి మిడుకుచున్నాఁడు. కైకను మంథరను పట్టుదము.

2. పౌర—ఏరీ! ఏరీ! వెదకుదము పట్టుదము నలుకుదము.

1. ఓరీ! ఈగదిలోనికిఁబోయి తల్పులువేసుకొనియున్నారు.

పౌరు—వాకింబ్లుపగలఁగొట్టుఁడు. గోడలుపడఁద్రోయుఁడు. (కలకలముచేయుదురు)

1. పౌర—రావురాయీవాకింబ్లు.

2. పౌర—ఆయింటికట్లనే యగ్గిపెట్టుఁడు దగ్ధమైపోవనీ.

1. పౌర— ఇంటిలో నగ్నియెందున్నదో వెదకుఁడు వెదకుఁడు.

కౌస - పౌరులారా! ఇట్టియరాజకమా? దండించువారెవరులేరా?

పౌర—రాముఁడు పోయినపిదప మాకు రాజెవ్వఁడు మాటలాడకుము. చిక్కినవారిఁ జంపుదుము. చావఁగొట్టుదుము—

1. పౌర—కొట్టుఁడు కొట్టుఁడు ఎవ్వతెయైన నేమి? ఎవ్వరైన నేమి.

పు-ప్రవేశము: లక్ష్మణుఁడు—(శీఘ్రమున.)

లక్ష్మణ—పౌరులారా! ఇందేమిచేయుచున్నారు?

పౌరు—ఇదిగోయగ్ని ఈయింటికగ్గిపెట్టుచున్నాము.

లక్ష్మ—పొండిక్కడినుండి ఇంతయాజ్ఞ లేనివారుందురా?

పౌరు—వీఁడేమిరా మాటలాడుచున్నాఁడు. కొట్టుఁడు కొట్టుఁడు.

లక్ష్మ—దురాత్ములారా! చచ్చితిరి. (విల్లెక్కుపెట్టును.)

పునః ప్రః (శీఘ్రముగ) రాముఁడు.

రామ—లక్ష్మణా! ఈవిల్లేటికి? పౌరులారా!

పౌర—ఓరీ! రామచంద్రుఁడు మాటలాడుచున్నాఁడురా! వినుండు వినుండు.

రామ—ఏమిసేయుచున్నారు? ఇందు?

పౌర—కైకను మంథరనుఁ గాల్పఁబోవుచున్నాము.

రామ—ఇట్టి మాతృద్రోహులుగలరా? ఊరకపొండు. రాజుభార్య మీకుఁదల్లిగాదా.

2. పౌర॥ తల్లియైననుమానము. తండ్రియైననుమానము.

1. పౌర॥ పౌర—రామచంద్రునితోనా యిట్టిమాటలూరకుండుము.

రామ—పౌరులారా! మీకు నమస్కరించెదను.

(అనుబంధము 37.)

పౌ—అయ్యో! అయ్యో! (నిష్క్ర)

రామ—లక్ష్మణా! ఇక్కడనుండియే పోవుదము. అందుపోయిన మాయయ్య యున్నాఁడాలస్యమగును. (లక్ష్మణునితో-నిష్క్ర.)

రామ—(రథముపైఁ గూర్చుండి) సుమంత్రా! ఇదె మాయయ్య వెనువడి వచ్చుచున్నాఁడు. రథము వేగపోనిమ్ము. (నిష్క్ర)

దశ—(వెంబడించుచు–కౌసల్యతో-సుమిత్రతో)—

కం॥ కలుషంబెకాని యమృతమె।
బలియనినరకంబెకాని వరములనివ్వఁ।
పలవించిపిల్చు జనకుని
యలుకారఁగనింత తిరిగియోయనియనవే॥

(అనుబంధము 38.)

సుమంత్రా! సుమంత్రా! రథమునిల్పుము. సుమంత్రా! (గట్టిగనఱచి) అయ్యో! రథముపోయె. ఏపుణ్యాత్ములైన దానినిలుపరే మారాముని నాకిచ్చువారులేరే. ఈసుమంత్రుఁడెట్టిదురాత్ముఁడు! ఎంతవేగముగఁదోలుచున్నాఁడు. రథపుటెక్కమైనఁగనుపడదే అయ్యో! ధూళియైనఁగానరాలేదే రామా! రామా! (పడును.)

కౌస—సుమి-హా! నాథా! (శిశిరోపచారములుచేయుదురు.)

దశ—కౌసల్యా! రాముఁడుపోయెఁగా? పోయెఁగా మారాముఁడు?

కౌస—ఈవిధినేమి యీదుఃఖము-పోదమురమ్ము.

దశ—ఎక్కడికి.

కౌస—అదియేగదా కైకయిల్లు?

దశ—కైక! కైక! ఎవ్వరాకైక?

కౌస—హా! దైవమా!

దశ—కైకగదా? తెలిసెను. దానిభవనము కలుషమూలకందము నీయింటికిఁ బిలుచుకొనిపొమ్ము— (నిష్క్ర)

ద్వితీయాంకము సమాప్తము.

---

శ్రీ

# పాదుకాపట్టాభిషేక నాటకము.

## తృతీయాంకము.

### ప్రథమరంగము-కైకేయినగరు.

[ప్రవేశము: మంథర.]

మంథ—అబ్బా! ఇప్పటికి నిక్కువముగాఁ జావుదప్పెను - నేనేమి చేసియున్నాను? ఎవ్వరొక్కరు నన్ని ట్లేలతిట్టవలయు? నాయేడ్పునమ్మిన కౌసల్యయుండకున్న లక్ష్మణుఁడు చంపుచుండెనేమో. ఈయూరిదుర్మార్గులో యింటికగ్ని పెట్టవచ్చిరి. ఈ విధవాసుతులందఱు రాముని వెంటఁ బాడయిపోయినారని తెలియువఱకు నేనుఁగైకయు వెలికిరామైతిమి. ఏమయిననేమి? కార్యమేమోముగిసెఁగదా? ఇంకిందుండిన నపాయము. గిరివ్రజపురమునకుఁబోయెదను. పోవుదమా వలదాయని యోచించుచున్నాను. పాలుద్రాఁగుదునా? పాయసము భుజింతునా? ఇప్పుడె వెడలిపోయిన నిక్కడమంటయేమో పెట్టినట్లాయెను. పాలుద్రావినయట్టేయగును. ఇందేయుండి భరతుఁడు రాజ్యమేలగా, కైకకుమాఱుగా సర్వాధికారములుజరుపుచు నన్నుఁదిట్టుచువచ్చిన యీయూరివారిపై కసియంతయుఁదీఱ నీవిధవలను విధవాసుతులను బాధించి పీడించి వేధించితినా, పాయసముదిన్నట్లగును. పాలకంటె పాయసమేమేలుగదా? అయిన భరతుఁడేమైనఁగైకపై విరోధముజూపెనా అప్పుడు పాయసముగాదు విషముద్రాగినట్లగును. దీనికేమిచేయవలయు? అట్లేలగును? భరతుఁడేమి మనుష్యుఁడుకాఁడా? మొదటనొకవేళ సంకటముగలిగినను, ఏకచక్రాధిపత్యముగాఁ జక్రవర్తిపదముగలిగినందుకు సంతసింపకపోవునా? సంతసించినపుడిట్టిభాగ్యముఁదనకుఁ గలిగించినందుకు కైకనుమెచ్చకుండునా? మెచ్చినపుడా కైక యీమంథరా సతీమణియుపాయమే తన్నిట్టి సుస్థితికిఁదెచ్చెనని చెప్పకపోవునా? అప్పుడు నేనెట్టిదాననగుదు! భళిభళి! ఈలోకమున నెవ్వరుబొందనియుచ్చాయపదవి నాకుఁ గలుగుఁగా! భరతుఁడెట్టి రాచకార్యమైనను నాతో నాలోచింపకఁజేయునా? భరతుఁడేలఁ నేఁగదా రాజ్యమేలుదానను? అదిగాక భరతునిపైనాకిప్పుడు—ఏదో "మోహామం"న్మరుగదా? అదిపుట్టియున్నది-పొంచులువినుముండ లిచ్చట నెవ్వరులేరే-పుట్టియున్నది. నాయభీష్టమునకు భరతునివలన సదుత్తరముగలిగిననుఁ గలుగవచ్చు. రూపమును గాకుండినను, బుద్ధినైన మోహింపఁడా? నేనించుకవయసు చెల్లినదానను నిజమే. అయిననేమి? ఏపుట్ట నెంతపాముండుటయు నెవ్వరెఱుఁగుదురు? కావున నేవానికీ సంతోషోదంతము నప్పుడే జాబువ్రాసి, తెలియఁజేసియున్నాను. నాయోచనా

విశేషమువలనఁ దనకీసౌఖ్యము గలుగనున్నదని తెలియఁజేసినాను. నాయభీష్టమొకటి నెఱవేఱెనా యింకేమున్నది! భళిరే! ఏదో యింతాయాసముగానున్నదని నేఁ జెప్ప, మాండవియొక చరణమును కైక మఱియొక చరణమును, నొత్తుచుండ - భరత చక్రవర్తి యడుగడుగునకు "దేవి కెట్లున్నది" యని విచారించుచుండ నాభోగ మెంతరాణించును! కానీ! — ఊరక ముందుముందే "గొంతెమ్మకోరిక" లెందుకు? జరిగినప్పుడుగదా యనుకొనవలయు? జరిగినప్పుడుగదా ఫలము? ఏల జరుగదు? నే నెంచినంతకంటె నెక్కువగా జరుగును. నాకుఁగలిగెడు కొడుకే భావిచక్రవర్తికాకుండునా? అదిగో కైకవచ్చుచున్నది మగనియొద్దకు సవతియింటికిఁ బోయి యుండె. అదియేమిట్టిమోమున వచ్చుచున్నది? రేవునకు బోవుదానివలెనున్నదే—

ప్రవేశము-కైక— (దుఃఖ భావమున.)

కైక—మంథరా! ఎంతపాపాత్మురాలనే. నీమాటవిని యెట్టిగతిఁదెచ్చుకొంటిని!

(అనుబంధము 39.)

నానాథునికిఁ బిచ్చిపట్టియున్నది. కలువరించుఁగాని మనుష్యులపైఁ బ్రజ్ఞలేదు. ఈ ప్రజ్ఞలేనివేళ సయితము కైకవచ్చినదన్నఁ బెడమోము చేసి ననుఁ జూడఁడాయె. అయ్యో! ఆముఖమునందలి శుష్కభావము చూడనతఁడు జీవించునట్లులేదు.

మంథ—కైకా! దైవమునీకేమి నోరాడించుచున్నాఁడే. "మగడుచచ్చును." "మగడు చచ్చున" ని మొత్తుకొనుచున్నావు. పెద్దకొమారుఁడు, పదునాలుగేండ్లవఱకురాని యూరికిఁ బోయియుండ శుష్కభావముండదా? నేఁడు శుష్కముగా నుండిన రేఁపు సగము శుష్కము. మఱునాఁడు పాదశుష్కము - నాలవనాఁడు, ఆర్ద్రమగును - ఎన్నిదినములుండఁగలదు?

కైక—మంథరా! అంతియేకదా? ఏమియు భయములేదుగదా?

మంథ—భయమేమున్నదే? అదియుండనీ, నీకొడుకు చక్రవర్తియయి నంతనె నన్ను మఱవవుగదా?

కైక—అదియుండనీ, మంథరా! రాముఁడెట్టి మహనీయుఁడే! చంపవచ్చిన లక్ష్మణునకు బుద్ధిచెప్పెను. ఎవరికలనను మరలని పౌరుల మరలించి మముఁదప్పించెను. ఇట్టివానికెట్టి యపకారమెంచితి.

మంథ—కైకా! నీవు పాలుద్రావ నేరవుగదే. దీనినంతయు నమ్మితివా? రాముఁడు, లక్ష్మణుఁడు, కౌసల్య, పురజనులు, మాటలాడుకొని నీయెదుట నిట్టినాటకమాడి రాముఁడింత సంభావితుఁడుగాయని నమ్మి నీవుకరుణింపఁజేసిన కుహకముగదా?

కైక—మంథరా! అట్లనా? ఇంతయేయుండునా?

మంథ—అంతగాకింకెంత? లక్ష్మణుఁడు దశరథునిఁదిట్టువాఁడా? తిట్టెబో, అంతకోపము, అంతధర్మశాస్త్రవాదము, గడవాఁడు రామునిమాటనే చచ్చినట్టూరకుండుట

స్వభావోక్తియగునా? దశరథుఁడు చెప్పినను, కౌసల్య బెదరించినను, లక్ష్మణుఁడు ధను వెత్తినను, మానని పౌరులు రాముని యొక్క మాటకే కుదురుకొనుట స్వభావోక్తియా? రాముఁడంతయే మొనర్చియున్నాఁడు? ఈయతిశయోక్తివలననే సంవిధానమేర్పడుఁగదా? అదిగాక రథము నెక్కి పోయిన రామలక్ష్మణులు మరల నెట్లు వచ్చిరి?

కైక—మంథరా! ఇప్పుడొప్పితిని. నీవెంత గుఱుతించినావే! ఎంతయుపాయమే!

మంథ—నాయుపాయమిప్పుడేమి? భరతుఁడు రాజ్యమేలునప్పుడు కనుఁగొందువు.

కైక—భరతుఁడన్న జ్ఞాపకముగలిగె. వశిష్ఠుఁడేమేయిట్లాడెను. భరతుఁడు రాజ్య మొల్లఁడఁట. నాముఖమునైనఁజూడఁడఁట. ఇట్లగునా?

మంథ—తొల్తఁగొంచెమట్లనే జరుగవచ్చును. "తల్లిక్రూరకృత్యమున రాజ్యము సంపాదించినంత నేకొంకు లేక రాజ్యమేలెడుఁగా భరతుఁడు" అని జనులందురను భయమునన ట్లే చేయవలయు. నాసాఁటనదియే చక్కఁబడును.

కైక—ఎట్టియుక్తియున్నదే నీమాటల! నీవు నాకుఁజెల్లెలవు.

మంథ—చెల్లెలనుము. కోడలనుము. దయమాత్రముండనిమ్ము. (కౌఁగిలించును.)

కైక—మంథరా! మఱియొకమాట. కౌసల్యకేటికే నీపైనభిమానము. నీవు నిర్దోషివనెను.

మంథ—అందునను మోసమే. నీవు నాస్వాధీనమనియెంచి నన్ను స్తోత్రముచేసిన నేను బ్బి తనకు మేలొనర్పవలెననియుక్తి. ఇట్టిముండల నేనెందఱినో చూచినాను. ముందుయోచనలు మిక్కిలిగానున్నవి పోదమురమ్మ— (నిష్క్ర)

శ్రీ

# పాదుకాపట్టాభిషేకనాటకము.

## తృతీయాంకము.

### ద్వితీయరంగము - కౌసల్యయిల్లు.

ప్రవేశము - దశరథుఁడు (పండుకొని) సుమిత్ర, కౌసల్య, (ప్రక్కన)—వశిష్ఠుఁడు.

వశి—నేఁడు కొంచెము గుణముగానున్నదా ?

దశ—ఏఁడుదినములైనదా నేనిద్రించి ?

వశి—రాజచంద్రా ! ఈ యేఁడుదినములనుండి నీకు శరీరముపై నించుకైన స్మరణ యుండలేదు. నేఁడు తెలివిగలిగినందుకు సంతసించితి.

దశ—సంయమీంద్రా ! ఇంకేటిసంతోషము ? మనసున దావాగ్ని పుట్టియున్నది. దహించుచున్నది. పాపాత్ముఁడ నైనందున నా తెలివిలేని సమయమునఁ జావనైతి. క్రొత్తక్రొత్తగా తెలుఁలు తెలులై యుద్భవించు దుఃఖమున మరలమరలఁ గుల్లికుల్లి మృతిఁజెందఁగదా యీ తెలివి వచ్చె—

వశి—రాజేంద్రా ! చింతింపకుము - యోచనీయములైన విషయము లనేకములున్నవి. రాముఁడరణ్యమునకుఁ బోయినరాత్రియే నీకుమదిదప్పె. నీసమ్మతి వడయకయే కార్యము చేయుటకులేక యూరకున్నాను.

దశ—హా ! ఋషివర్యా ! నీవలన నెట్టిమాటవింటిని ! రాముఁడరణ్యమునకుఁ బోయెనా ? నేనమ్మను. పొఁలవడితిరి. ఇందే యూరనుండవలయు. విచారింపుఁడు.

వశి—అయ్యో ! యేమిసేయవచ్చును.

దశ—ఇదిగో రాముఁడిక్కడికే వచ్చెను. రామా ! చూడుమా ! నిన్నందఱు నరణ్యమునకుఁ బోయినాఁడందురు, ఇటురమ్మి. ఏల దూరముపోయెదవు ? ఇంకేల యోచన ? వరములడిగిన కైక మృతిఁబొందె. ఇంకే మటంకము. పట్టముగట్టికొమ్మి.

వశి—కౌస— } హా ! మరలఁ గలిగెనే మతివిభ్రమము.
సుమిత్ర—

దశ—మతివిభ్రమము ? నాకెక్కడిదే మతివిభ్రమము ? కైకచచ్చుట యబద్ధమా ? రామా ! నీవైన వీరికిఁ జెప్పుము.

వశి—హా ! శ్రీహరీ

దశ—శ్రీహరీ? శ్రీహరీ? ఏమి శ్రీహరీ? రామా! చూడుమా వీరెల్ల "శ్రీహరీ!" యనుచున్నారు. కౌసల్యా! కైకేయి శవము దహింపఁబడెనా ?

వశి—ఇప్పుడు తొందరపెట్టకుఁడు. తర్వాత కార్యాలోచన చేయుదము.

దశ—కార్యాలోచనములు? కార్యాలోచనము లేమి? రామునికిఁ బట్టము గట్టుట కంటెఁ గార్యమేమి? రామా! పోయి స్నానముచేసిరమ్ము. ఆ నారచీరలు విడువుము. (మెల్లగా) పొమ్ము-పొమ్ము—(నిద్రించును.)

వశి—రాజేంద్రా!

దశ—(ఊరకుండును.)

వశి—కొంచెము నిద్రపట్టియున్నది. తెలివిగలిగిన పిదప నడుగుఁడు మీరెవ్వరన భరతునిఁ బిలుపింపవలయునా వలదాయని. ఇక్కడికార్యములొక్కటియు వానికిఁ దెలియకున్నవి. అడుగక జాబెట్లు వ్రాయుదు.

దశ—(ఊరకుండును.)

వశి—ఏమఱికితనిఁ గాఁచియుండుఁడు. నేఁబోయివత్తును.

దశ—(లేచి) ఆచార్యా! ఏటికిఁ బోయెద విందురమ్ము.

వశి—ఏల రావలయు? నీవు చక్కఁగ మాటలాడుచున్నఁ గదా!

దశ—మాటలాడ కేమి?

వశి—ఊరక కలువరించు చున్నావే.

దశ—అయ్యో! ఈ చింతాగ్నికాల్ప నిద్రయేలేదే. కలవరమెక్కడిది?

వశి—ఒకమాటడిగెదను. సరిగ్గైన యుత్తరమిచ్చిన వచ్చెదను. భరతుఁ డెందున్నాఁడు?

దశ—గిరివ్రజపురమున. ఇదేలడిగెదవు?

వశి—అయిన వచ్చెదను. (కూర్చుండి) భరతు నిటకురమ్మని జాబువ్రాయఁగోరి నిన్నడుగవచ్చితి. ఏ ముత్తరమిచ్చెదవు?

దశ—అయ్యో! వలవదుడుగుమా! ఆదుష్కర్ముని మోమేఁ జూడను.

వశి—అయ్యో! దశరథా! వాఁడొక్కపాపము నెఱుఁగఁడే. ఇట్లేల?

దశ—వాఁ డెట్టి వాఁడైననేమి? ఎన్నితపములో యెన్నియజ్ఞములో చేసి లోకైకవీరుఁ డగు కుమారుఁ బడసితినే. అట్టివాని నస్సుఁబాపెనే. బాలఘాతుకియే, కిరాతక సంజాతయే, అట్టికైక కన్నవాని ముఖముఁ జూతునా? చూచినప్పుడే నాప్రాణములఁ బాసెద.

కౌస—నాథా! అయినదయినది. ఈకార్పణ్యమున నేమిప్రయోజనము? మన దుష్కాలమునను, కైకకట్టిబుద్ధిపుట్టెఁగాక మొదటినుండి దానిగుణము తెలియని వారమా? దానిక్షమింపుము. అదికడు కటకట పడుచున్నది. ఎన్నిమాటులో వచ్చియుండెను. దానిదుఃఖముఁ జూడఁజాల. ఇప్పుడే పిలువఁబంపెద. కరుణింపుమా

దశ—అయ్యో! వలదు వలదు. ఆ పతిఘాతుకిని నేఁ జూడను. కౌసల్యా! నేనింకను గొన్ని దినములు జీవించియుండఁ గోరిన నీపనివలదు.

కౌస—నాథా! నాథా!

దశ—(ఊరకుండును.)

కౌస—మరలమూర్ఛగలిగెఁగదా?

దశ—రామా! రామా! ఇందేలపండుకొంటివి? (జోకొట్టి) పండుకొనుము. పండుకొనుము. నిద్రపొమ్ము అయ్యో! ఈపదునాల్గేండ్లరణ్యములనెట్లుంటివి? అయ్యో! ఈకాలుసేతులెట్లు కాయలుగాచియున్నవి! నిన్నుమరల నేఁజూడననియెంచియుంటిసుమా. నీముద్దుమోము మరలఁజూడలభించెఁగా? పండుకొనుము. లేవకుము. ఆకైక మిమ్మునెంతబాధపెట్టెను. సీతా! ఏలనిలుచుకొనియున్నావు. కూర్చుండుము. లక్ష్మణా! కూర్చుండుము ఱేఁపేచేయుదమా రామా నీపట్టాభిషేకము? నీవుపోయితివి భరతుఁడుచచ్చెను. ఈపదునాల్గేండ్లు వశిష్ఠుఁడేరాజ్యమేలుచుండె. సీతా! ఈమధ్య నానీవీకొడుకుఁగనినది? తెమ్మామనుమని (ఎత్తుకొనిముద్దాడి) ఆఱేండ్లవాఁడా? ఎట్టిముద్దుమనుమఁడు! రామునిపోలిక తీసితీయకుండ నున్నాఁడే. సీతా! ఈముద్దుకుమారు నరణ్యమునఁగంటివే నీకానుపెవ్వరుచేసిరి? ఉపచారము లెవ్వరుచేసిరి?——

కౌస—సుమిత్రా! నానాథుఁడీయజ్ఞానస్థితినైన మనుమని ముద్దాడుచున్నాఁడే. ఈభాగ్యమైననాకులేదే——

దశ—"అజ్ఞానస్థితి"? ఏటికే? కౌసల్యా! చూడుమీమనుమఁడెంత ముద్దుగారుచున్నాఁడు. నీకేమిజాడ్యము. ముద్దాడకున్నావు? అయ్యా! నీపేరేమి? ఆఱేండ్లయ్యు నీకింకనుమాటలురావా?

కౌస—సుమిత్రా—హా! దైవమా! హా! నాథా! (మూర్ఛిల్లుదురు)

దశ—కౌసల్యా! ఇంతవఱకు నేనేమిమాటలాడితినో నేనెఱుఁగ. నాకాయాసము మిక్కిలిగానున్నది నేఁబ్రతుకనుసుమా.

కౌస—హా! నాథా! అట్లేలమాటలాడెదు? నీకేమయినది?

దశ—కౌసల్యా! సుమిత్రా! నేనిదివఱకు మీకుఁ జెప్పనిరహస్యముఁ జెప్పెదను. నాకాయసురులతోడి యుద్ధమునకుఁ బోవకముందు ఘోరశాపముగలిగె. అది యింత వరకు స్మరణకు రాదయ్యె.

కవిరాజవిరాజితము॥ సరయువుపాంతనొకానొక రాతిరి సామజబుద్ధిధ [రాసురునా।
శరమునఁజంపితిదానినెఱింగివెసం దలిదండ్రులువచ్చిరిదు।
స్తరమగుపుత్రవియోగముఁగాంచి "సుతా సుత" యంచుఁదపిం [చుచుదు।
ర్మరణమునొందుమటంచు శపించిరిమానునెతాపసశాపమిభా॥

కౌస—నాథా ! నీకలువరపుమాటలలోనే నిన్న నే యీశాపవృత్తాంతము వింటిమి.

దశ—వింటిరా ! ఆశాపఫలమనుభవింపక తీఱునా ? ఇఁకఁగొన్నిగడియలకేనా యంత్య మున్నట్టున్నది.

వశి—ఇక్లేలందువు ? నీకంటెఁ గష్టములనుభ వించినవారులేరా ? ఇదిగో కైకేయివచ్చు చున్నది. ఊరాల్పుము.

ప్రవేశము-కైక—(దీనభావమున.)

కైక—హా ! నాథా ! నన్నేల యిట్లునిరాదరణచేసెదవు ? నేనెట్లు భరింపఁగలను.

దశ—హా ! హా ! కైకా ! కైకా ! అయ్యో ! కుమారా ! రామా ! (మోముద్రిప్పి.) నన్నెట్టియిడుమలపాలుచేసితివి. నీకుఁ బగదాయనైతి. మృత్యుదేవతకు వరము లిచ్చితి. నీపాలి యమకింకరుఁడనైతి.

స్రగ్ధర ॥ నాకేలాదక్కునా యున్నతగుణమణి యానవ్యకందర్పుఁడ
కీకారణ్యంబులం జిక్కు-టివేతనయనీకీడు చింతించినిన్నుఁ ౯ । [య్యో ।
బోకార్వంగంటినెంతోపోగిలితినిఁక నేఁ బోయెద న్నిన్నుఁజూడ౯ ।
గైకానీకైకదానా కలుషహరుని నాకామునిం గోలుపోతి౯ ॥—

అయ్యో ! ఇట్లవునని యెఱుఁగఁగదా ? అక్కటక్కటా ! నామరణమువేళ నా ముద్దులాఁడు, నామోహపుపట్టి, నాకులభూషణుఁడు, నామన్మథ మన్మథుఁడు, నా వేలుపుమొదవు, నాపూర్ణచంద్రుఁడు — నావంశాభరణము — నా తరుణా ర్కుఁడు—నా నోముఫలము—నన్నుఁగన్నతండ్రి—నా ధనము—నా నిధానము—నా శిఖరము-నా చూళికాభరణము - నా కమనీయాదర్శనము-నా చింతామణి - నా దైవము-నా సుకృతవిశేషము-నా కూర్మికుఱ్ఱఁడు_నా జీవరత్నము-నా యనుంగు పాపఁడు—నాదండనుండుటకు నోచనైతిఁగదా ? రామా ? సూర్యకుల కలశ వారాంనిధిసోమా -నిన్నెంతలయించితి. ఎట్టినిష్ఠురాటవులకుఁ బంచితి. ఎంత క్రూరకృత్యమొనరించితి. కుమారా ! నీవీపురికి మరల వచ్చినపిదప నన్నుక్షమిం పవలయు సుమా. అప్పుడు వేఁడికొనుటకు నేనుండఁగలవాఁడనూను. ఇప్పుడే బ్రతికియుండఁగ నే విన్నవించెద. ఎట్టి క్రూరాత్ముఁడనైనను, ఎట్టి భీకర శాత్రవుఁడనైనను, తండ్రినగుదుఁగదా ? నిష్కారుణ్యముగ నిన్ను భయంకరాట వులకుఁబంచి నిర్లజ్జనై నాప్రాణలతలకుఁ గుఠారమెత్తిన ఈకిరాతక విధవనే నీ వెగ్గులాడ వైతివే. ననుక్షమింపవా ?

లయగ్రాహి॥ మందమతినై మదనసుందరుని నాకొ
లఁపుఁ జందురుని నందమగునందనునినిన్నుఁ ౯ ।
డెందమునసింతయునుఁ గొందలములేకవ
నులందు ధరణీధరములందువసియింపఁ ౯ ।
పందురఁగఁ బంచివెఱగంది దిగులొంది బెడఁ
గొందివడిఁగంది మదిఁగుందితిఁ గుమారా

సుందరతఁ జిందునరవిందములఁ జందురునివిం
దుగను నీముఖమిఁ కెందుగనుఁ గొందుగ॥—

అయ్యో! ఏమిత్తమించి యేమిప్రయోజనము? నీముద్దుమోము మరలఁజూడఁజాలఁగదా? అక్కటా! నీవాపాడు విపినములకుఁబోవునాఁడు నాతోమాటలాడితివే. అదియేకడమాటాయెఁగా నాకునమస్కరించితివే. అదియెతుదనమస్కారహా? నిన్నాశ్లేషించితినే. అదియె యంత్యాశ్లేషమా? నీవురథమెక్కిపోవ వెనుదవిలి చూచితినే-యదియెకడచూపా? అక్కటా! ఎట్లుభరింతు.

సీ॥ వనికేగునాఁడునన్జనకాయనుచుఁబిల్చి
తదియయొకడపిలుపాయెనాకు।
ఆకైకయింటనిన్నాలింగనముసేయు
టదియయొకడసారియాయెనాకు।
ఆనాఁడునీవదనారవిందముచూచు
టదియయొకడచూపెయాయెనాకు।
అలనాఁడునీవున్నడలకుమనియంటి
వదియయొకడమాటయాయెనాకు।

తే॥ గీ॥ నె॥ ఎటులభరియింతుఁదరియింతు నిలజరింతు।
నుసురుచాలింతుఁబలవింతునుమ్మలింతు।
గడఁగివేగింతుఁదుదఁగాంతుఁగలువరింతుఁ।
గృతముగణియింతు రఘురామరిపువిరామ॥

ఆసీతాస్వయంవరమునాఁడు లోకమువారందఱు నినుమెచ్చిమెచ్చి పొగడుచుండఁగ ర్ణానందముగవింటినే. ఇట్టికీర్తివంతునకిట్టి వంశభూషణనకుఁబట్టముగట్టక నారాజ్యమేలయనియెంచితినే. ఎంచియుమఱచితినే. మరణసూచకమగుదుస్వప్నముపచ్చువఱకుఁదలంపనైతినే. భరతుఁడిందున్నప్పుడే యాస్వప్నమురాఁగూడదా? నావిధినన్నెంతచేసెను.

అయ్యో! తాపసులేశతవృద్ధులే. అట్టివారియేకపుత్రుని నిరపరాధుని నాపాడు బాణమునఁ జంపితినే. నాకునలుగురు కొడుకులుండియు వారిలోనొకని నరణ్యమునకుఁ బంపుట కిట్లుపరితపించితినే. ఆయేకపుత్రునిఁ గోల్పోయి యా వృద్ధాంధ దంపతులెంత నొచ్చిరో. ఎంతకటకటపడిరో. ఎంతతపించిరో. అటుతప్పులైవారిచ్చిన శాపమ్మునాకుఁ దప్పునా? నిర్ధగ్ధముచేయదా?

క్రౌంచపదము॥ దానవభీమా-తారకనామా-ధరణివరవినుతదశరథరామా-।దీనసురాగా-ధీగుణయోగా-త్రిదశవరనుతవిదితబహుభోగా।మానవవీరా - మారశరీరా - మురరిపుమహిధరమదపవిధారా । భానుసుతేజా - పాలితరోజా - బహుళసుగుణయుత వరితధరాజా ॥—

హా! సీతా! ఇందుఁగల సర్వైశ్వర్యములమాని నీపతివెంటఁబోయితివిగా.

సుగంధీ॥ ఈడులేనిసాధ్వీనీ వహీనభంగినీపతిక్ ।
గూడిరాజ్యభోగమొందఁ గోరియుంటిగాదెయా ।
పాడుకాననెట్లునీవపార దుఃఖమొందెదో ।
కోడలానినుందలంపఁ గుందుమానదయ్యయో ॥—

రామా! భరతుఁ నఱుఁగంటఁ జూడకుము. వాఁడు నిరపరాధియ కానోపు. ఈ దుడుకుచెయ్దము మీదుర్జాతి దకాక వాఁడు పాపరహితుఁడుగా నుండ నోపు సుమా—వాని క్షమింపుము.

(అనుబంధము 40.)

రామా! రామా! రామా!— (చచ్చును.)

కౌస—నాథా! రాముఁడు నీకుఁజెప్పఁడా మమ్ముఁబడింపుమని, ఇదియూఁబడించుటయా? ఏలమాట్లాడవు? (చూచి)

హా! నాథా! (పడును,)

సుమి— } (చూచి) హా! ప్రాణేశా!
కైక— } (పైఁబడుదురు.)

వశి—ఏమి? ఏమి? ఏమి?

కౌస—ఇంకేమి? నిర్దయాస్వాంతుఁడై మాపతిమముఁ బాసిపోయె.

వశి—హా హా హా హా!! హరి హరి!!

(అనుబంధము 41.)

కౌస—నాథా! మమ్ము నిట్లనాథలఁ జేసిపోయితివే. మాపైనింతకరుణ కలుగదయ్యెనే. ప్రాణేశా! మే మెందుజోరువారము. మమ్ము నెవ్వరు మాటాడించెదరు. రాముఁడు 'నాకులేకపోయినను, నీ శుశ్రూషచేసి కాలము గడిపెదనని యెంచియుంటినే. ఆపుణ్యమునాకు లేదయ్యెనే. ప్రాణకాంతా! "రామా! రమ్ము. కూర్చుండుము పండుకొనుము." అని కలువరించుచు నైన నింకఁగొన్నియేండ్లుండవైతివే. నీవు కొంతదుఃఖ మనుభవించి కన్నులు మూసితివి. మాకుఁగదా పడరాని పాట్లుగలిగె. నీవు సత్యసంధుఁడవని ప్రతిజ్ఞ నెఱపి జగములఁ గీర్తిగంటివి. రాముఁడు

జనకునాజ్ఞ నెఱవేర్చిన కీర్తిఁగనియె. దుష్ఫలములన్నియు మాకుఁగలిగించితివి. అయ్యో! సత్యమునకై కొడుకుం గానలకంపితివి. సత్యమునకై మరణముఁ దెచ్చుకొంటివి. సత్యమా! సత్యమా! హానాథా! (మూర్ఛిల్లును.)

(అనుబంధము 42.)

కైక—హా! నాథా! ఇట్లౌనని కలనైన నెంచనైతినే. ఏమిప్రాప్తిఁ దెచ్చికొంటిని. ప్రాణేశా! ననుఁ గన్నెత్తి చూడుము. నాకు వరములు వలదు. ఇంక డుగను. ఈవరములును వలదు. రాముని బిలువఁబంపుము.

కౌస—కైకా! మావలె నీవేలయేడ్చెదవమ్మ సంతోషింపక? నీకొడుకునకుఁ బట్టము గోరికదా యింతకార్యముఁ జేసితివి? నీయపరాధమునకు ఫలము నీతోడ మమ్ము విధవలఁజేసితివే. అమ్మా! నీకేమికొఱఁత. కొడుకున్నాఁడు. చక్రవర్తియయ్యెఁడు. నాకుఁ గొడుకులేఁడే. నానాథుఁడు పోయెనే. హా! నాథా! నాథా!

సుమి—ప్రాణేశా! ననుఁ జూచినప్పుడంతయు నాకు సుమిత్రనామము కడుసార్థకమనుచుంటివే. "సుమిత్రా"! యని నన్నెవ్వరింకఁ బిలుచువారు? కైకా! ఇంక సర్వసుఖములనుభవింపుము. నేనేమి తప్పొనర్చితినే. నన్ననాథఁగాఁ జేసితివి.

వశి—రాజదేవులారా! ఇంకేమి ప్రయోజనము? మీరెంతశోకించినను దశరథుఁడు రాఁగలఁడా? ఊఱడిల్లుఁడు.

కౌస—అయ్యో! మాదశరథుఁడిం కెక్కడనున్నాఁడు. ప్రాణేశా! నీముద్దుకుమారుఁడు రాముఁడరుదెంచినాఁడు చూడుమా.

వశి—చూచి భరింపఁజాలను. (నిష్క్ర.)

తృతీయాంకము సమాప్తము.

శ్రీ

# పాదుకాపట్టాభిషేక నాటకము.

## చతుర్థాంకము.

### ప్రథమరంగము—బాటదారి.

ప్రవేశము-భరతుఁడు, శత్రుఘ్నుఁడు. (రథముపైన).

భరతుడు—శత్రుఘ్నా! రథమింతనిలుపుము.

(అనుబంధము 43.)

ఇదెయయోధ్య క్రోశమాత్రమున్నది. ఊరుదాపునకువచ్చినది. కడుపునఁ జేయివెట్టి కలఁచినట్లయ్యెడు. గుండె దిగులయ్యెడు. మరలనైన నీజాబుల యర్థమాలోచింతము.

శత్రుఘ్న—ఇన్నిమారులు చదివితిమే—

భరత—ఐననేమాయె. మరలఁ జూతము. ఏమయినఁ దెలియునేమో. (జాబులు దీసి.) ఈజాబు మాయయ్య యీచైత్ర శు॥ చతుర్థివ్రాసినాఁడు. నాకు నష్టమి నాఁడు ముట్టినది. ఇందేమియు విశేషములులేవు.. ఆకస్మికముగా రాముని పట్టాభిషేకమహోత్సవము తలవెట్టినట్లును, ఇందుకు దుస్స్వప్నము కారణమనియు వ్రాసినాఁడు. నేను లేకుండుటకు మిక్కిలి చింతిల్లియు శుభదినములు లేనందున విధిలేక పంచమినాఁడే మహోత్సవము నెఱవేర్చెదనని వ్రాసినాఁడు. దీననేమున్నది? ఈ మంథరయు వశిష్ఠుఁడును వ్రాసినజాబులే యవిదితార్థములుగ నున్నవి.

మన తండ్రివ్రాసిన జాబు నాకుముట్టిన యష్టమినాఁడే మంథర జాబును ముట్టెఁ గదా? అయిన నది దానిచే పంచమినాఁడు వ్రాయఁబడినది. దీనిమరలఁ బర్యాలోచింతము. (చదువును.)

"చేయు విజ్ఞప్తులు-ఇందు విశేషాదంతములు మెండుగాజరిగినవి. పూర్ణఫలితార్థము దెలిసికొనక వానినన్నిటి మీకునివేదించుట యనావశ్యకమనిమానితి. అవి మీకు మిక్కిలి సంతోషావహములగుటచే మున్ముందు మీకీజాబుమాత్రము వ్రాసితి. ఎట్టిసంతోషమయినను స్వల్పదుఃఖముతోఁజేరిననే యానందజనకము. బుద్ధిశాలురాదుఃఖమునుమఱచి సంతోషమునే గ్రహింతురు. మీరు సుధీశాలురేకదా? మీసంతోషమునకు నేనేకారణభూతనౌటచే నేనేముందీజాబు వ్రాసియున్నాను. మీరిప్పుడేమియుఁ ద్వరపడిరావలసిన యవశ్యకములేదు. ఎంతయాలస్యముచేసిననంతమేలును కార్యసాధకమునునగు. ఇట్లు-మంథర."

ఇంతయైనను దీనియర్థము తెలియదుగదా? సంతోషమేమో చింతయేమో తెలియకున్నది. నాఁటినుండి వృత్తాంతమే తెలియక పరితపింప శు॥ త్రయోదశినాఁడు వశిష్ఠులు వ్రాసినజాబు మొన్న పూర్ణిమనాఁడు ముట్టెనుగదా? దానిందిలకింతము.

"రామ పట్టాభిషేకము నిల్చియున్నది. ఈజాబందినతోడనే యతిశీఘ్రముగ నీవురావలయు. మనోవేగమున నీవువచ్చినను, ఇంకను ఆలస్యమేయగు. ఇందు జరిగియుండుసందర్భము లెన్నిగ్రంథములువ్రాసినను దీఱదు. అవిక్షేమవార్తలనుటకును దుఃఖవార్తలనుటకును నీచేనున్నది. ఈజాబుతెచ్చినవారి నే వృత్తాంతము నీవడుగవలదు. నీవేమడిగినను మూఢభావము వహించియుండవలయునని వీరికి గట్టి కట్టడయొనర్పఁబడినది. నీవిందువచ్చువఱకు నిక్కడి యుదంతములు నీకుఁ దెలియఁగూడదనియు, తెలిసినను ప్రయోజనములు కావనియు నిట్లొనర్పఁబడియున్నది. ఈజాబుచేరిన మూఁడవనాఁడు-తుదకు నాల్గవనాఁడు-నీవయోధ్యకుఁ జేరకున్న నీవు దశరథునికొడుకవనుట నిష్ఫలము. ఇది గురువునాజ్ఞగాభావింపుము."

ఇందు శ్రీకారముగాని కుశలోదంతముగాని తుదఁ కాశీర్వాదమనియైనవ్రాయలేదు. ఏముండును?

శత్రు—భరతా? ఎన్నిమాఱులోచదివితిమి. ఏమైనఁదెలిసెనా? ఇదెయూరుసమీపించె. పోయినవన్నియు విశదములగుఁగదా?

భరత—శత్రుఘ్నా! ఎట్టియుత్పాతములు జరిగినవియో తెలియకున్నదిగదా? మాజనకుని పాదములకు నమస్కరించి యతని యాలింగనము వడయువఱకు, శ్రీరామచరణములకెఱఁగి యతనిదీవనలు వడయువఱకు, లక్ష్మణుని సౌఖ్యోదంతమువినువఱకు, నాకూఱటకలుగదుగా? శత్రుఘ్నా! చూచితివే యీపురము పాడూరివలెనున్నది. ఈపౌరులఁగంటివే. నన్నుఁజూచి కన్నీరునించి మోములావలద్రిప్పుకొనిపోవుచున్నారు. నన్నిట్లేలచూచెదరు. నాకుఁ గళవళమగుచున్నదిసుమా. ఈసంతాపమునకుఁ గారణముఁ దశరథుఁడో రాముఁడో మఱియెవ్వరో యెఱుఁగఁగదా?

మ॥ పురివారల్ననుఁగాంచి కన్నులను వాఃపూరంబునిండంగసో
దరయావైపున మోముఁద్రిప్పిచను చందంబూహచేయంగ దు
స్తరమాతండ్రియొ రాముఁడో జననులోసౌమిత్రియో సీతయో
పరితాపంబునకుంగతంబు మఱియెవ్వారో యెఱుంగంగదే॥

మ॥ వికచాబ్జాభముధారుణీశుముఖముఞ్ వీక్షింపఁగాఁగల్గునో
సుకృతోదంచితసాధ్యులఞ్ జననులఞ్ జూడంగనున్నాఁడనో
యకలంకంబగు రాము మోముఁగనుభాగ్యంబున్నదే యెట్టులో
నాకొావీనుంగవ నెట్టివార్త వినఁగానున్నాఁడనో సోదరా॥

అదియేల నగుమోమలర లక్ష్మణుఁడు నాకెదురు రాచున్నాఁడు. రథమింక నిలుపుము. వెనుకకుఁ బోదము. క్షేమోదంతములన్నియుఁ దెలిసి మఱివత్తము.

శత్రు—ఇట్లధైర్యపడి ప్రయోజనమేమి? కైకేయిమాతయిల్లే సమీపముననున్నది. అయ్యెడకే పోవుదమా ?

భర.—ఎక్కడికైనను పోనిమ్ము. కన్నులు చెవులు మూసికొనియుండెద. "క్షేమము"ను వార్తనీనోట వచ్చువఱకు నిట్లేయుండెద. అయ్యో! ఈపాడుచెవులీనాఁ డెట్టివార్త విననున్నవో కదా ?

శత్రు—ఊఱడిల్లుము, కైకేయిమాతయింటికే రథము పోవనిచ్చెదను.

(నిష్క్రమించును.)

శ్రీ

# పాదుకాపట్టాభిషేకనాటకము

## చతుర్థాంకము.

### ద్వితీయరంగము—కైకేయియిల్లు.

ప్రవేశము—కైకేయి (దుఃఖమున)—మంథర.

మంథర—కైకా! దుఃఖింపకుము. ఏమిచేసినను దశరథునిఁ బడయఁగలవా? వయసు చెల్లినవారిఁబెండ్లియాడిన కాంతలకంతయు రాఁదగిన గతియే నీకుఁగలిగెను. నీవేమి లోకమునకరుదా?

కైక—మంథరా! నీదుశ్చరితముగదా నన్నీగతికిఁ దెచ్చెను. నేనందఱివలె సౌఖ్యముగనే యుంటినే.

(అనుబంధము 44.)

సీ॥ కలకాలమపకీర్తిఁగలిగించు నత్యంత
కలుషకృత్యంబంచుఁదలపనైతి ।
ఘోకార్వవిపినాళి లోకైకవీరుఁడౌ
సుకుమారుఁడేయంచుఁజూడనైతి ।
పాపంబుఁదలపోయ కాపాడువరముల
కిదిఫలంబగునంచు నెన్ననైతి ।
నాథుండుసవతులు నాకాళ్లఁబడివేఁడ
నార్ద్రమానసమింత యరయనైతి

తే॥ గీ॥ నవనిఁగలసతులలోననత్యధమనైతి ।
ధవునిపాలిటికేఁబగదాయనైతి ।
విపులసంకటముఁ గుందువిధవనైతి ।
మంధరాలోకనింద్యనై మనఁగనైతి ॥

మంథర—నీకు వ్యసనము వేళగనుక నీవేమన్న నూరకుందును. ఔనమ్మా! నాదుశ్చరితముననే నీవు చక్రవర్తిమాతయైనది. నాదుశ్చరితమువలన నీకేమినొప్పులైనదే? నీపతి యింకఁగొన్నిదినములకైనఁ జచ్చియుండఁడో? రామదాసుఁడైయుండఁదగిన నీపట్టి చక్రవర్తియవుటయు కొన్నిదినములకైనఁ జావనున్న నీపతి యిప్పుడేచచ్చుట

యు. సరిపోల్చితులఁ దూఁగఁజేయుము. ఏదియెక్కువగునో ? అదియెట్టిపతియే. నిను మెచ్చి వరములిచ్చి నీకు స్వతంత్రముగల వరములడిగినమాత్రముననే తాఁజచ్చుట వలను నీముఖమయిననుఁ జూడనిపతియేటిపతియే కీశపతి ? అతఁడుండి యేమిసుఖమ నుభవింపనుంటివి. నేను ఖండితవాదినిగానఁగనలకుము. అతఁడుపోయినదే యిప్పుడు భరతునికి క్షేమము. తండ్రియుండిన భరతుఁడు రాజ్యమేలనొప్పు కొనుచుండెనో లేదో ? ఇప్పుడు నిరాటంకము. ఇప్పుడో యింకొక క్షణముననో భరతుఁడు రా నున్నాఁడు. వానియెదుట నీవిట్లు చింతతో యేడ్చుచుండిన యేమనుకొనును. ఇది యెవ్వరిబోధనయోవిని యిట్లుచేసియుండుననని యనుకొనఁడా ? నీవింతచేసి, సవతుల వలన తిట్లుబడి కన్నుముండలతో ననుఁదిట్టించి పతినిఁ బోవఁగొట్టుకొని అందఱివలన తిట్టువడుటకా నీవిట్లొనర్చుట ? వండి తపిలదించి ఆకుననుంచుకొని యనుపానములు గలిపి కబళముఁజేఁబట్టుకొని నోటికిఁగొనిపోవునప్పుడు నేలఁబాఱవేయఁజూచెదవే. అదిగో రథధ్వానము. భరతుఁడేవచ్చెఁగాఁబోలు. దుఃఖముమానుము. మందహాసముఁ దెచ్చికొనుము. కార్యముసాధింపుము.

[ప్ర॥ భరతుఁడు శత్రుఘ్నుఁడు.]

భర—శత్రు—(కైకకు నమస్కరించెదరు.)

కైక—(మందహాసమున) అన్నా భరతా లెమ్ము.

భర—మాతా ! ఊరంతయుఁబాడువడియున్నది. ఎట్టివిశేషములుగలిగె. జనకునకు క్షేమమా ? తల్లులకందఱికి సౌఖ్యమా ? సీతారాములకుఁ బ్రమోదమో? లక్ష్మణునకుఁ గుశలమా ? ప్రజలకంతయు నానందమా ? రాముపట్టాభిషేకమేలనిల్చెను? నీముఖమేటికి స్మితసహితమయ్యు వంతమానదు ?

భుజంగప్రయాతము॥ క్షమాధీశుఁడమ్మా సుఖంబున్నవాఁడే ।
సుమిత్రాదిమాత ల్విశుద్ధల్శుభంబే ।
ప్రమోదంబెరాముండు రామానుజండున్ ।
సమాఖ్యాతయాసీత సౌఖ్యంబెమాతా ॥

కైక—కుమారా ! ఈదశరథుఁడు ననుమోసముచేసి నిన్ను వంచించి నిన్ను గిరివ్రజపుర మునకుఁబంపి రామునిపట్టాభిషిక్తుఁజేయనెంచెను. అలదేవాసురల యుద్ధమునాఁడు అతఁడు నాకు రెండువరములనిచ్చియుండె. ఇప్పుడు వానినడిగితి. ఒకటికినీకుఁబట్ట ముగోరితి. మఱియొకటికిరాముఁదాపసవృత్తిం బదునాలుగేండ్లరణ్యముననుండ వేఁడితి. సీతాలక్ష్మణులతో రాముఁడరణ్యమునకుఁబోయె. ఇప్పటికేడుదినములక్రిందట దశ రథుఁడుమాత్రము కాలధర్మమునొందెను.

భర-శత్రు—హా ! పతిఘాతుకీ ! పుత్రఘాతుకీ ! (మూర్ఛిల్లుదురు.)

మంధ—(తొంగిచూచుచుండును.)

భర—(లేచి) హా! పుత్రఘాతుకీ! నీవేలపుట్టితివి? నాకేలతల్లివైతివి? సుకుమారుఁడైన రామునీవడవులనుండఁగోర నీనోరెట్లాడెను? అక్కటా! నీవు కేకయరాజునకు జనించినదానవా. కటికిరాక్షసునకు నీతల్లి నినుఁగనియుండవలెఁగాకున్న నీద్రోహబుద్ధి నీకుండునా? ఏమిపరములే. ముద్దుకుమారుని నాకులస్వామిని నాదేవదేవుని నడవులకుఁబంపి పతినిఁ జంపికొంటివే. దశరథుపాలిటిమృత్యుదేవతవైతి. ఇట్టిక్రూరకృత్యము లొనర్చి చిఱునవ్వుదెచ్చుకొని నాతోమాటలాడనోపితివా! నీకు కొడుకనవుటచే దుర్జాతుఁడనైతి. అపకీర్తిపాలైతి. కైకా ఆరామునిఁబాసి నేను రాజ్యమునకు సమ్మతింతునని నమ్మితివా? నీకు జనించినమాత్రనె నీయట్టిక్రూరమానసము నాకుండునని యెంచితివా? వానిపాదసేవలేని సురరాజ్యమైననే నాశింతునా? నా జనకునిఁ జంపఁగలదానవనియొక్కనాఁడు నిన్నెఱుఁగఁగదా? అయ్యయో! తల్లిబిడ్డలకు, తండ్రికొమారులకు, అన్నదమ్ముల కెరవుచేసితివిగదే. అక్కటా! ఆ జనకుఁడు నన్నెంతతిట్టుకొనుచుఁ బ్రాణములఁబాసెనో? ఆరామునికి నాపైనెంత విసుగుగలిగెనో? ఆపతివ్రతా తిలకము, కౌసల్యకు మోమెట్లు చూపుదు? అయ్యో! ఈజన్మమేటికి? శ్రీహరీ!

శత్రు—భరతా! ఇది గదాయింతకుఁ గారణము? ఇప్పుడు తెలిసెనా? యిది నీకు జాబువ్రాసినలక్షణ మిప్పుడైన నెఱుఁగనయ్యెనా? అది సంతోషమఁట! ఇది స్వల్పదుఃఖమఁట! స్వల్పదుఃఖము వృత్తాంతము విదితమాయెఁగదా. ఈపలుగాకి- ఈభాలఘాతుకి - ఈజగజంత - దుర్జాతీ! చావుము - (మంథరను పడవేసి కుత్తుక ద్రొక్కును.)

మంథర—అయ్యో! అయ్యో! చచ్చితి. చచ్చితి!

శత్రు—(కత్తిపట్టి) ఈదురాత్మురాలిని ఫ్రడ - (కైకపైఁబోవును).

భరత—(నిలిపి) శత్రుఘ్నా! ఈకులద్వేషిణిఁ జంపినపాపము మనకేల? ఎట్టిద్రోహమానసయైనను మనతల్లి యుదియను మహాపయశము మనకుఁ గలదుగా? ఇదిపతిపుత్రఘాతుకియైనను మనము మాతృఘాతుకులేల కావలయు. మనమిట్లుచేసిన మమ్మురాముఁడు ద్రోహులనఁడా? ఆదరించునా? దీనిఁజంపుట రామునికి హితమైన లక్ష్మణుఁడు చంపకుండునని యెంచితివా? ఈదుర్జాతిమంథర చావనైయున్నది. ఇట్లొనర్చినందుకె రాముఁడు నమ్మునేమనునో?

కైక—హా! దైవమా! (నిష్క్ర.)

భర—శత్రుఘ్నా! తరంగతరంగములుగా దుఃఖము గలుగుచున్నదే. హా! జనకా!

(మూర్ఛిల్లును.)

(అనుబంధము 41.)

(నిష్క్ర.)

---

శ్రీ

# పాదుకాపట్టాభిషేక నాటకము.

చతుర్థాంకము.

తృతీయరంగము-భరతునిల్లు.

[ప్ర॥ భరతు: జాబుచేపట్టి.]

(అనుబంధము 40.)

సీ॥ మా రాఘవుఁడు లేమి మనసనమైతోఁచు
నీపాదూరుగన్నెత్తిచూడఁగలనె।
తలయెత్తరానినిందల మోచిదుష్కీర్తి
నవనిపై నిఁకఁ దిరుగాడఁగలనె।
కనినయంత నెలోనఁగటికి శోకమునించు
కైకేయివదనంబుఁగాంచఁగలనె।
పడరానిబన్నముల్ పడిన కౌసల్యకీ
పాపపు మోమింకఁ జూపఁగలనె।
తే॥ గీ॥ రాముపదసేవమాని నేఁ బ్రదుకఁగలనె।
వెలయుభూజాతఁగనక జీవింపఁగలనె।
యనుజులక్ష్మణు నెడఁబాసి మనఁగఁగలనె।
కటకటాశోక జలరాశిఁగడవఁగలనె॥

హా! దుఃఖము! శ్రీరామునింకెన్నఁడు చూతును? అతడునన్నెట్లు కరుణింతును? కరుణింపకున్న నసువుల భరింపఁగలనా? అయ్యో! నే నెంతప్రార్థించినను, జనకాజ్ఞపాలింప కతఁడు పురికివచ్చునా? అతఁడు రాకున్న నేనిందుండఁగలనా? ఆరాముఁడు అర్థిజనసురా రాముఁడు పాదచారియై యరణ్యములనుండ నేఁ జతురంతయానములఁబురముఁన దిరుగాడుదునా? అతఁడు కందమూలఫలాహారుఁడైయుండ నే భక్ష్యభోజ్యముల స్వీకరింతునా? అతఁడు ధరాతలశయానుఁడై యుండ నేఁ బాన్పులపై శయనింతునా? అతఁడు పర్ణశాలావాసుఁడై యుండ నే

సౌధాంతరములనుందునా ? అయ్యో! ఎట్టికఠినమానసకే జనించితి? కటాక్షమాత్రమున ముల్లోకములఁగలఁపఁజాలు తమ్మునితో, చంద్రికాయతసుందర మందస్మితమాత్రమున నిట్టికైకఁబోలువారిఁ బదివేవురదాసీ జనములుగానొనర్చి యేలఁజాలు ప్రియకాంతతోఁ గట్టెదుటనిల్చి వనమున కనుజ్ఞయడుగ నీదృషత్కఠినమానసము మెత్తపడదయ్యెఁగా ? నేనీకైకకేల జనించితి ? కౌసల్యకైనను బుట్టనైతినే. ఊరకరణ్యములకుఁబోవుచుంటినే. అయ్యో ! ఇట్టినిర్భాగ్యునకట్లేలయగు? జగదేకమాన్యసుగుణసాకల్యయగు కౌసల్యకు నాయట్టి కలుషాత్ముఁడు జనించునా? జనలోకావనుఁడై పూతచరిత్రుఁడైన రాముఁడీకులతరులవిత్రకు, ఈయపయశపాత్రకు ఈజీవితకాకకీకైకకు జనించునా ? అయ్యో ! ఈకైక యెంఁదటికైనఁజెడుగెంచి నాయొక్కని మేలుకొఱకనికదా యిట్టి దుష్కృత్యమొనర్చె. ఇదెట్టి విపరీతఫలముగలిగించె! దశరథుఁడన్న నెంతదుఃఖమైనను నాల్గుదినములనుభవించి కన్నులుమూసె. కౌసల్యయో పతివియోగమునరును, పుత్రవియోగమునతును, ఇప్పుడు దుఃఖించిననుపదునాల్గేండ్లపిదపనైన సుఖములనుభవింపఁగలదు. సుమిత్రయు నట్టిదేయగు. రాముఁడన్న సతితోఁ దమ్మునితోఁ బదునాల్గేండ్లు సౌఖ్యమునఁ గడపిరాఁగలఁడు. ఇందలిదుఃఖము లొక్కటియు నెఱుఁగక సౌఖ్యముగనున్నాఁడు. లక్ష్మణునకన్న, ఆయన్నపాదపద్మములు గొలిచియుండుటకంటె సౌఖ్యమేమున్నది ? సీతాదేవియో పతియందు బద్ధానురాగయై తదేకశేషిత్వభావమునఁ గలసియుండుటఁజేతయేమి ? నాసంగతికదా పరమసంతాపకారకము. కన్నతల్లి శత్రువాయెను. పెద్దతల్లులకును సీతారామలక్ష్మణులకును నేపగవాఁడనైతిని. అయ్యో ! ఎక్కడిపగవాఁడ ! పగతుఁడైనను తనశత్రువునుఁ దపసివేషమున నరణ్యములనుండుమనికోరునే ! కటికిచండాలుఁడఁగదా ? ఆతండ్రియో నన్నుఁ గలుషాత్ముఁడనియెంచి యట్టిమానసముననే ననుఁజూడక మాటాడక మనవివినక మృతిఁబొందె. అతనిఁబోఁగొట్టికొంటి. చచ్చునపుడును దండనుండనైతి. అతనిచావుచూచినదిచాలక హృదయముకుమిలించు నతనియుత్తరక్రియలు నేనచేయఁబాల్పడితి. కటకటా ! జనకా ! నినునాకెవ్వరిచ్చువారు ? ఈదుఃఖాంబుధి నేగతిఁదరియింతు. తలయెత్తుకొని యింకేభంగిఁజరియింతు ? సంతాపమునెక్కడిభరియింతు ? ప్రాణానిలములనే కరణిధరియింతు ? అపకీర్తిభరమునే మాడ్కిహరియింతు ? కౌసల్యకు మోమెట్లుచూపుదు. నాప్రాణానిలముల నిప్పుడే పోకార్చువారుగలుగరా. సంహననౌషధములే భిషగ్వర్యులైననాకీరా ? మారణమంత్రములనే మంత్రవాదులైన నాపైఁబ్రయోగింపరా ? హా ! నిర్భరము. రామా ! రామా ! కైకా ! కౌసల్యా ! జనకా !— (మూర్ఛిల్లును.)

శ్రీ

# పాదుకాపట్టాభిషేక నాటకము.

## చతుర్థాంకము.

### తురీయరంగము-కౌసల్యానగరు.

[ప్ర॥ కౌసల్య-దుఃఖించుచు మూర్ఛిల్లి,]

భరత-శత్రుఘ్న-వశిష్ఠులు-(ప్రవేశ.)

భరత—సంయమీంద్రా! నాచేతఁగాదు. ఇన్ని సంకటములకోర్చితిని. ఇదిశక్తి మీఱియున్నది. నేనామెకు ముఖముఁజూపఁజాల.

వశి—భరతా! ఇట్టైన నెక్కుడికిపారము. ఊరకరమ్ము. ఈశత్రుఘ్నునకుఁ దెలిసి నంత నీకుఁదెలియదా?

భర—ఋషితిలకా! శత్రుఘ్నునివలె నేఁగానైతి నే. క్రూరాత్మకయగు కైకగర్భము నుండి వెల్వడినకాలసర్పమ నైతి నే.

(అనుబంధము 42.)

కౌస—నాధా! రాముపట్టాభిషేకము నీవు చూడనోపకున్నను కైకకిచ్చిన వరమునకై భరతుపట్టాభిషేకమైన నీవు చూడవైతివే.

వశి—రమ్ము-రాకున్న నెట్లుతప్పను. (ఈడ్చును).

భరత—(ముందటికివచ్చి), తల్లీ! ఏమూడక్షరములు లోకకంటకములై యాచంద్రార్కమపకీర్తిఁగనెనో, ఏమూడుకలుషాక్షరముల భరించిన నిర్భాగ్యుని సంతాపైకభోగుని గనుటచేఁగైకగర్భము ఘోరవ్యాళమునకు మనికిపట్టగు గుహాకుహరమును, కాలభుజంగమాశ్రయమగు ఘోరవల్మీకమునుఁ బొందెనో - ఏమూడుపాపాక్షరములఁ వానివలన నీకును, సుమిత్రకు రామాదులకుఁ బడరాని పాట్లుగలిగెనో - ఏమూడక్షరముల యర్థము పితృ భ్రాతృ ఘాతుకమని జగముల నెగడెనో, ఆ దుష్టాక్షరముల భ-ర-త-నామము వహించిన క్రూరకర్ముఁడుపీఁడే. అమ్మా! వలసిన శాపమొసంగుము. తెగడీయుము. దయఁజూడకుము.

(అనుబంధము 43.)

కౌసల్య—అయ్యా! భరతచక్రవర్తీ! కొడుకునుఁగోడలిని భీకరారణ్యములకుఁబంపి మగనిఁబోఁగొట్టుకొని గత్యంతరముఁగానకున్న •మేమేడ్వవలయుఁగాక నీయిష్టానువర్తన

మునుఁ గావలసినవరములడుగఁ గైకయుండ నీకోరినసార్వభౌమ పదమబ్బియుండ నీకేల శోకము ?

భర—అమ్మా ! కౌసల్యాదేవి ! రామలక్ష్మణులఁబాసి దశరథులేకుండఁజేసికొని యప కీర్తి మైతలయెత్త నోపకుండుటం బడిపోవనసియాడుచున్న నా ప్రాణములనిప్పుడే తీసితివి. అయినను, ఇవి యెంతతీఁపులో పాయనేరకున్నాను. అమ్మరో ! రాముఁడు కరుణింపకున్నను లక్ష్మణుఁడు కనలినను, దశరథుఁడునన్నుఁదప్పుఁదలఁచినను సాగుణము నీవు గుర్తెఱుఁగుదువుగదా యని నమ్మితి. దైవమున కింతకరుణారైనను రాదాయెఁగా? అమ్మా! నిక్కమాడెదను. నీచరణములానవచించెదను. ఈభూమ్యాకాశములు, దివ్యవాణియు,పంచభూతములు,సూర్యచంద్రులిందుకు సాక్షులౌదురుగాక! తల్లిరో-ఈకైక-మానసఘూక,వ్యాళపాకయొనర్చిన పాపము, నేగిరివ్రజ పురముననుండునప్పుడైన, అందుఁడ నిపుడుపైనున్న మాజనకుఁడీ జాబువ్రాసినప్పుడైన, ఇపుడుపచ్చుపోవు ప్రాణములతోఁదనుకులాడుచు చచ్చియుఁజావకయున్న యీకలుషములకు మూలకందమగు దుర్జాతిమంథరయీజాబు నాకువ్రాసినప్పుడైన, నాలుగు దినములక్రిందట మాతండ్రిపరలోకముచేరిన వృత్తాంతమునయితము నాకుఁ దెలుపక యీవశిష్ఠ మునీంద్రుఁడీకమ్మనంపినప్పుడైన, పురమంతయు వెలవెలఁబోయి మసనంబు కరణి ధూమధామమైయుండిన చందమునేఁ జూచినప్పుడైన, ఈపౌరులొక్కరొక్కరు నామోముఁజూచిచూచి కన్నీరునించినించి విసికివిసికి పెడమోము సావలఁబోయినప్పుడైన, శత్రుఘ్నుఁడు రథములదోలనే నేతెంచి దశరథరాజన్యుని రాముని కనమాట వినఁజేసిన పాపపు నెలఁతగు కైకయిలుసొచ్చినప్పుడైన, గున్ని యిడుములఁగలిగించి పతినిఁజంపియు భయంకరస్మేరమువహించిన యాపాపిని పాదములకు నేనమస్కరించినప్పుడైన, నాకుఁదెలిసియుండెనా, పంచమహాపాపులును, పరహింసకులు, మాతృహింసకులు, కన్యావిక్రయికులు, న్యాయవిక్రయికులుఁబోవుపాపములకుఁబోవువాఁడ. ఇదికల్లయైన నాకునరకప్రాప్తిగలుగుఁగాక. నాకుఁ గూడుపుట్టకుండుఁగాక-నానోటఁబురువులుపడి పుచ్చిపోవుఁగాక-శరీరమునఁగుష్ఠవు గలిగి నాసంధిబంధములన్నియు వ్రీలపడిపోవుఁగాక! అంధత్వమును బాధిర్యమును నాకొక్కసారియేకలిగి విచారించువారులేక, అడవులమన్నుదిని దిక్కులేక మృతిఁ బొంది నాశవముందహించువారైనలేక గ్రద్దలపాలగుఁగాక. జననీ! అమేయమహిమోపేతుఁడై మాకులమున వెనుకటివారికి, ఉన్నవారికి, పుట్టనున్నవారికి శిఖరోపముఁడై నిజయశస్సుధాధవళితదిగంతుఁడై, పరసతీసోదరుఁడై, సుగుణఖనియై, తమ్ములనన్నఁ బుత్రులకంటె నెక్కువగా నెవఁడుచూచునో, ఎవఁడు గలుగుటఁజేసి కౌసల్యయనుపేరు సకలవీరసూసందోహములకు మాతృకయగునో, యేవనియుద్భవము సజ్జనహింసకులును, యజ్ఞయాగధ్వంసకులుననగు రాక్షసదివాంధ సందోహమునకు సూర్యోదయమో, ఎవ్వనియపాంగము సజ్జనమానసచకోరములకు చంద్రికయో యెవ్వాని యీవిపురందర నందనమందార సందోహముల తలలువంచెడినో, ఎవ్వాని ప్రతాపము ప్రభాకరానల పద్మశోగ ప్రభలఁబరిహసించెడినో ఎవ్వని భ్రుకుటిధా

రుణీవరవిదారి భూరికుఠారధారినైన ముకుళితహస్తుఁజేసెనో, అట్టియాచక కల్పకథా మునకా, సుందర తేనుప్రభాకామునకా దుర్గ్రహప్రథనభీమునకా, తరణిస్థలాపాం నిధిసోమునకా, ఘనాయుతకుంజరస్థేమునకా, విచారితసర్వప్రకృతి జనక్షేమునకో, భ్రుకుటిమాత్రనిర్జిత పరశ్వధరామునకా, భూసురదత్తగోమణీ ధరాగ్రామునకా, మహాసుర నికారణభూరి సంగ్రామునకా, నీలమేఘశ్యా మునకా, జానకీకాము నకా, రామునకా, నేనెగ్గులెంచుట ? అమ్మరో ! నీవు శపింతువని భయమొందను. ఈప్రాణములఁ దృణప్రాయముగ నెంచెద. ఆపురందర పదవియైన నణుమాత్ర ముగ నుపేక్షించెద. నేనిటుచెప్పికొనుట భయమువలనఁగాదు. నీకుఁబ్రియమని కాదు. మోసమొనర్చుటకుఁగాదు. ఇచ్చకమునకుఁగాదు. నీయట్టి సాధ్వీమతల్లి నిరపరాధినైన నన్ను సంశయించెనేయని పాపమున కోర్వలేమివ చించితి. ఇంక వలసిన శాపమొసంగుము భరియించెద.

[ప్రవేశము: కైక.] (ఒకప్రక్కన)

త్రు— మాతా! నేను దశరథుఁడు పట్టాభిషేకముచేయ నెంచినవాఁడనుగాను మాతల్లి వరములనడిగి నన్నభిషిక్తుఁజేయఁగోరదయ్యెఁగదా ? నామాట నమ్మవచ్చును. ఈభర తుఁడయోధ్యవిడిచినదిమొదలు నేఁటివఱకు వీనితోడనేయున్నాను. ఈఁతడు నిర పరాధిసుమా !

శి— కౌసల్యాదేవి ! ఈభరతుఁడు నిష్కలుషుఁడు. వానిమన్నింపుము.

ర— మాతా ! నేనిష్కలుషుఁడగాను. ఏపాపమొనరింపకున్నను, కులవిధ్వంసనము గా వించిన యాగోముఖవ్యాఘ్రమునకు, అవజ్రహృదయకు, ఆకైకకు జనించినపాపమే—

సల— (భరతు నాలింగనముచేసి) కుమారా! భరతా ! నీశుద్ధమానసమెఱుఁగనా ? కళవళముఁగన్న సముద్రములోని యలలమాడ్కిఁబైపైవచ్చు దుఃఖపరంపరల కోర్వ కిట్లాడితి క్షమింపుము.

(అనుబంధము 44.)

ఆరాము వేఱె నినువేఱుగాఁజూతునా? నీవేమారాముఁడవింక. అయ్యో! ఆకైక నేల యిట్లాడెదవు ? నాకు సంతాపముగల్గదా ? చిన్ననాఁటనుండి దానినెఱుఁగనా? దశరథునిశాపము ఫలింపదానికి నేఁడిట్టిబుద్ధిపుట్టెఁగాక. అదియును స్వబుద్ధిగాదు. మంథర బోధనమేయని తెలియదా ?

కైక— (ముందరికివచ్చి కౌసల్యపాదములపైఁబడి) జననీ ! అది స్వబుద్ధికాదని యేలం దువు ? మంథరచెప్పినమాత్రముననే నాబుద్ధిపురువుమేసెనా. అమ్మా ! మాజననికిమా ఱుగా నీవున్నదానవు. తల్లియెదుటఁబొలెవచించెదను. ఆమంథర నాపాలివిధివోలె పీడించెను. ఎంతబుద్ధితిరిగినను మానకయుపదేశించెను. అప్పటికదియే ప్రియమయ్యె శివమెత్తినచందమున శరీరముపైఁబ్రజ్ఞలేక యెట్టివరములడిగితినో యేమొనర్చితినో యెఱుఁగను. ఒక్కపాపము వేఱొక్కపాపమునకుఁ దెఱువుఁజూపెను. ఒక్కసారి

పాపమొనర్చిన కఠినహృదయము దాని మెత్తపఱచుసందర్భములు గలిగినట్లంతయు మఱింత కఠినమగుచువచ్చె నిట్లీయీగతికివచ్చితి. నీశాపోపహతిఁ గుంగుచున్న నాకుఁ బ్రాయశ్చిత్తములేదు. బిడ్డయేయని కరుణించితివా నాక్రూరకృత్యమున నరణ్యముల పాలైయున్న 'రాముశరణము వేఁడఁబోయెదను. అతఁడెట్లొనర్చినను హితమే.

(అనుబంధము. 45.)

కౌస—(కైకం గౌఁగిలించి యేడ్చును.)

అందఱు—(ఏడ్చెదరు.)

వశిష్ఠ—ఇట్లూరక దుఃఖించిన నేమిప్రయోజనము. ఈకైకయే మనకిప్పుడుపదేశకర్త యాయె. ఇక్కడికార్యములఁదీర్చి యరణ్యములకు మనమందరముపోయి రామును పాసింతము - లెండు.

శత్రు—ఇక్కడి కార్యములేమున్నవి. ఇప్పుడె వెడలుదము.

వశి—దశరథుని పారలౌకిక క్రియలు—

అందఱు—హా! దుఃఖము.

భర—సంయమీంద్రా! మాతండ్రిని సుగంధ తైలకటాహమున నుంచితిమంటిరే - చూడనైనఁ జూచెదను. కొనిపొమ్మా!

అందఱు—హా! హా!

నిష్క్రమింతురు.

చతుర్థాంకము సమాప్తము.

శ్రీ

# పాదుకాపట్టాభిషేక నాటకము.

## పఞ్చమాంకము.

### ప్రథమరంగము-అడవిలోఁబర్ణశాల.

[ప్రవేశము: రాముఁడు-సీత-రాముఁడు జడలతో.]

---

రామ—సీతా! చూచితివా? యీచిత్రకూటాద్రి యెంతరమణీయముగానున్నది! ఇట్టి నిదాఘోష్మఖదినములను మధ్యాహ్నమున నెంతచల్లగానున్నది!

సీత—అవును-కడురమణీయముగానున్నది. ఇందెన్ని దినములుండినను తృప్తికలుగదు. ఈఘునాటవుల నీనగాగ్రములఁ జెట్లెంతగొప్పవి. చూడుమా యశ్వత్థవృక్ష మెంతపెద్దదియో.

రామ—ఇదియేటికి మనమయోధ్యవిడిచిననాఁడు తమసాతీరమున నొక్కయశ్వత్థవృక్షాంతికమున నే విశ్రమించియుండలేదా! అదియేమి తక్కువగానుండెను?

సీత—అయోధ్యాపురి పౌరులందఱును మనమును విశ్రమించియుండినదిగదా? అదియుఁ బెద్దదియే. అయ్యో! ఆరాత్రి యర్ధరాత్రమున మనము పౌరులకన్ను మఱగించి యేతెంచితిమే. వారెంతదుఃఖించిరో!

రాము—అట్లుచేయకున్నవారు మమ్మువిడుచుచుండిరా? ఇప్పుడు మాటలాడినదేమి? వృక్షములవిషయముగదా! గంగాతీరమున యొకరాత్రి గారచెట్టునీడనుంటిమే. ఆవృక్షమెట్లుండెను.

సీత—అదియును పెద్దదియే. మఱియెక్కడనో యింకను గొప్పవృక్షముఁజూచితిమి?

రామ—శృంగిబేరపురమున గుహునితోనున్నపుడు చూచినదియేకదా? వటవృక్షము.

సీత—అవునవును. ఆవటవృక్షము పాలేకదా—

రామ—నేనును లక్ష్మణుఁడు నుపయోగించి జడలుదాల్చినది. సీతా ఆనాఁడు నీవెంత యేడ్చితివి? ఇప్పుడీజడలతో నేనెట్లున్నాఁడను?

సీత—ఆయనంగుని సంహరించిన పురవైరివలె నున్నాఁడవుగదా?

రామ—అయినా నాకు ఫాలలోచనమేది?

సీత—మొన్నఁజూచితినా ఫాలలోచనమును.

కం॥ మంటలఁ గ్రమ్మెదుకన్నుల ।
ఁగంటక మొనరించినట్టి కాకాసురునిక్ ।
గెంటింపఁ గనినవేళ ।
గ్గంటిన్నీ ఫాలలోచనము ప్రాణేశా ॥

నీవు పర్ణశాలనాతొడపై నిద్రింపనన్నుఁ జెనకినకాకా సురుపై నీ విషీకమువైచి నపుడు నిక్కువముగా నీకు ఫాలలో చనత్వమల వడియుండె

రామ—నాకుఁ గల్గినకోపమునుఁబల్కెదవా ?

సీత—కోపము నేకాదు, ఆకాకము తనకన్ను నీ యస్త్రమునకివ్వదో అదియే నీఫాలలోచనము, అప్పుడే నీవు మూసినది.

రామ—అయిన నీవాపురవైరిక నంగుని సంహరించిన పిదపఁ జేకూరినగిరిరాజ సుతవే.

సీత—ఆమె నేనెట్లగుదు ? ఆమెశంకరులో నర్ధాంగిని కాదా ?

రామ—నీకర్ధాంగమేటికి-పూర్ణాంగముగావింతు (కౌఁగిలించును).

ప్ర॥ (శీఘ్రగమనమున విల్లెత్తుకొని)-లక్ష్మణుఁడు.

(అనుబంధము 46.)

నీశాంతగుణమే నిన్నింతకుఁదెచ్చె-లెమ్ము - పైఁబడియేతెంచు శత్రుస్తోమముం జించి చెండాడుదము. నీవురాకున్న నాకైన నాజ్ఞయిమ్ము.

రామ—నీమాట లేమియుఁదెలియవు. శత్రుస్తోమమేది.

లక్ష్మ—అందుచూడుము. ధూళియెట్లగయుచున్నదో.

రామ—అవును - దేనిధూళియది ?

లక్ష్మ—భరతాది శత్రువర్గము వచ్చుచున్నది.

రామ—నీకెట్లు తెలిసెను ?

లక్ష్మ—ఆచెట్టెక్కి చూచితిని. కోవిదారాది ధ్వజములగపడెను.

రామ—అయిన భరతునేమి చేయనెంచితివి ?

లక్ష్మ—ఇదెనా బాణము. అదెవాని వక్షఃపీఠి. ఏది కఠినమో చూచెద.

రామ—అట్లేటికి ?

లక్ష్మ—నిన్నుఁగాదనితాఁ బట్టముగట్టికొన్నది చాలక మహాగర్వసంరంభమున మనపై వచ్చుచున్నాఁడు గదా ?

(అనుబంధము. 47.)

రామ—

లక్ష్మణా! దశరథునికొడుకవై నాకుఁదమ్ముఁడవై సుమిత్రగన్నవాఁడవై నీవిట్లాడుటచెల్లునా? ఆభరతుఁడెవ్వఁడనియెంచితివి? నీకంటె నాకుఁగూర్చువాఁడు. నీకంటెవాఁడేమిటఁదక్కువ? నీయట్టితామసగుణమొక్కటి వానికిఁ గలుగదు గాక. పురముచేరిపట్టమొల్లక దశరథుఁబంపున మమ్ముఁబ్రార్థింపఁగదా వాఁడిందువచ్చి యుండవలయు?

[ప్రవేశము: భరతుఁడు-శత్రుఘ్నుఁడు-దూరమున.]

భరత—శత్రుఘ్నా చూచితివే లోకములన్నియుఁ గటాక్షమాత్రమున నేలఁజాలిన భోగి యెట్లున్నాఁడు! సార్వభౌమ సింహాసనపీఠపై సేవాసమవేష్టిత రాజరాజన్యులమోము లకుఁగళలుదెచ్చు విరాజన్మణీవితాన ప్రభామహితంబగు కిరీటము ధరింపఁగల పూజ్యశిరంబెట్టుభూషణ విహీనమైయున్నది! చూచిన నెట్టిమానసమును నీఱుగాక పోవునే.

శా॥ గాత్రంబల్లనఁజిక్కె దైన్యము సమగ్రంబయ్యె నెమ్మోమునన్ ।
నేత్రంబుల్ముకుళాబ్జసన్నిభములై నిస్సారతంజూపెనో ।
శత్రుఘ్నా కనుఁగొన్న మానసము చంచత్కీలలన్ గ్రాఁగదే ।
శత్రుల్ఘోరరుగాదె వైరులకు నీచందంబు వాటిల్లఁగన్ ॥

(శత్రుఘ్నునితో నమస్కరించును)

రామ—(భరతు నాలింగనముచేసి) భరతా! కుశలమా? రాజ్యమంతయు సురక్షితమా? ప్రకృతిజనుల బిడ్డలఁబోలెఁజూచెదవా? రాజాంగములఁ జక్కగానరయుదువా? సేవకులఁగరుణఁబాలింతువా? గోదేవభూదేవులఁబూజింతువా? వర్ణాశ్రమధర్మములఁబాలింతువా?, జారచోరులులేరుగదా? ప్రభుమంత్రోత్సాహశక్తుల సామదాన భేదదండములఁ జక్కగానెఱిఁగితివా? షడ్గుణంబులఁగ్రహించి సప్తవ్యసనములమాని చతుర్దశపాపంబులవర్జించి పాళికులకు దుఃఖములేకుండఁ గోరరిగొంచు సత్యైకవ్రతుఁడవై ధర్మైకనిష్ఠుఁడవై సర్వసముఁడవై యున్నాఁడవెకదా? తమ్ముఁడా! నీవేల యిందురాగలయు? ఎవ్వరితోడనైన నీక్షేమోదంతము మాకుఁజెప్పిపంపి యుండినఁజాలదా? అదియేమిట్లు కన్నీరునించెదవు? నాకొఱకు వగచెదవా? లేక నీకొఱకా?

భర—అన్నా! ఎవ్వరికొఱకేల నాకొఱకె వగచెదను.

రామ—తమ్ముడా! మనవారందఱికిని సౌఖ్యమేకదా.

మత్తకోకిల॥ రాజపూజితుఁడల్లతండ్రి ధనావిభుండు సుఖుండెయా।
రాజదేవులుతల్లులందఱు రాణనుండెడువారలే।
భూజనంబులునిన్ను భక్తినిఁ బూజచేసెదువారెయా।
హోజఁగన్నులనీరుగారెనయోయిదేటికిసోదరా॥

భర—హా! నిర్భరము.

రామ—భరతా! ఏమి నిర్భరము? నాపాదుచెవులనీనాఁడెట్టివార్తఁ జెప్పుచున్నావు?

భర—అన్నా! ఇంతకువచ్చి సంకోచమేల?

గీ॥ మనకులాఢ్యుండు మనరాజు మనగురుండు।
మనసుదైవము మననిధి మనధనంబు।
మనదు భాగ్యంబు మనవాసి మనబలంబు।
మనసుకృతరాశి మనతండ్రి మనకులేఁడు.

ప్ర॥ వశిష్ఠుఁడు. దూరమున.

రామ
లక్ష్మణ } హా! జనకా! జనకా! (మూర్ఛిల్లి-లేచి).

(అనుబంధము 48.)

రామ—హా తండ్రి - మము ముద్దుచేసి పెంచి కాపాడినతండ్రి-సత్యప్రతిజ్ఞుఁడై కరుణాగుణభూషణుఁడై చిరరాజ్యమేలిన తండ్రి మాకులేఁడయ్యెగా! కటకటా! ఎట్టి పాపపువార్త—

వశి—రామచంద్రా! సకలతత్త్వవేదియైన నీకిట్టిప్రాకృతభంగి యేలకలిగె? సహింపుము - నీ ముగ్గురుతల్లులు నినుఁజూచుటకై వచ్చియున్నారు - నీపాటునకు శోకఘూర్ణమాన మానసులైయున్నారు. వారినూఱడింపుము, పోదముఱమ్ము—.

(నిష్క్ర-9.)

శ్రీ

# పాదుకాపట్టాభిషేకనాటకము.

## పంచమాంకము.

### ద్వితీయరంగము-అడవియేపర్ణశాల.

[ప్రవేశము: రామ-లక్ష్మణ-భరత-శత్రుఘ్నులు-వశిష్ఠుఁడు-సీత-కైకేయి-కౌసల్య-సుమిత్ర-కూర్చుండి భరతుఁడు జడలతో.]

భర—అగ్రజా! నమస్కరించి విన్నవింతును. నీవులేని వైకుంఠపదవియైన నొల్లననుటనీ వెఱుఁగవా? నీవభిషేకమునకయ్యకొన్నను విహితమే. ఈరూపమున నే నను నీదండనుండ సమ్మతించినను విహితమే.

రామ—భరతా! ఈజడలు నారచీరలు నీకేల? మనజనకుఁడు నినుఁ బట్టమునకు నియమించియుండ నీకు జరుపకున్న నెట్లు?

భర—జనకునియాజ్ఞ తెఱంగున రాజ్యమే నాయదిగదా? నిశ్చలమానసమున నేనీకిచ్చుచున్నాఁడనే. ఏల యనుగ్రహింపరాదు?

రామ—పదునాల్గేండ్లరణ్యములనుండెదనని నేవచించితినే. అదితప్పుదునా?

కైక—రామా! నాకొఱకైకదా నిన్నా జనకుఁడరణ్యములకనుపుట? వరములడుగుట కెట్లో వానివదలుటకును నాకు స్వాతంత్ర్యముగలుగదా? నేనే యిప్పుడువలదనుచున్నానే. నీకేటికీ ప్రతిజ్ఞ?

(అనుబంధము 48.)

రామ—జననీ! ఎఱిఁగియెఱిఁగి యిట్లేలాడెదవు? నాకాజ్ఞయొసఁగినవాఁడు జనకుఁడుగదా? అతఁడులేఁడే. అతఁడుండి యీమాటచెప్పియుండిన నెట్లగుచుండెనోకాని యిప్పుడు తిరిగిన నధర్మము.

కైక—మృతిబొందువఱకు నన్ను నానాథుఁడు కన్నెత్తిచూడఁడాయెనే.

భర—అన్నా! మావిధియిట్లున్నది. దశరథునడుగక వ్రాయరాదని యీసంయమీంద్రుఁడు జనకుఁడుసచ్చునఱకు జాబేనాకువ్రాయఁడాయె. నేనేమిచేయుదును? పోనీ దశరథుఁడు పిలుపించియుండిన వచ్చుచుంటి నంటివికదా? ఆదశరథుఁడేల నిన్నరణ్యములనుండుమనియె? ఈకైకకైగదా? ఆయమయే యిప్పుడు తనవరములు వలదనుచున్నది. ఇప్పుడు దశరథుఁడున్న నిన్ను రావలదనుచుండెనా? ఉద్దేశమింత విచారింపవలదా? నీవెట్లైయున రక్షింపకున్న నేనన్యథాగతియెఱుఁగను. నీవు రాజ్య

భారమువహించియున్న నీభృత్యుఁడనై యెట్టికార్యమునైన నెఱవేర్పఁజాలుదుఁగాక తాపసవృత్తి నీవీయరణ్యముల నిట్లుండ నెట్టి సంతోసమున నే రాజ్యమేలుదు ? ఏయూరటనే నీపృథివీభారము వహింతు, కరుణావిశేషమునను, తేజోమహత్త్వమునను, కీర్తిప్రతాపముల వైఖరిని, సత్యనిష్ఠఁజేసియు, ప్రభుత్వమహిమాదిశక్తి విశేషములను, లోకములెల్లనేలఁ జాలిన నీకుఁదగుఁగాక యీరాజ్యము నాకుఁదగునా ?

(అనుబంధము 49.)

(కాళ్లు పట్టుకొనిపడును.)

రామ—భరతా ! (అని కాలువదలించుకొనును.)

భర—(చేతఁజిక్కిన రామపాదుకలు పట్టుకొనును.)

రామ—నీవింక నిట్లాడిన నాయానగలదు. అవరజా ! ప్రీతివిశేషమున మదిదెలియ కిట్లాడెదవుకాక ముందు వెనుకలు యోచింపవే. ఆదశరథుఁడుండిన ననురమ్మని యుండు నిక్కపమే. అయినలేఁడే. ఇట్లిచో నేవచ్చిన రాజ్యలోభుఁడనియు, ప్రభుత్వైక కాముఁడనియు, జనులుకొందఱైన నన్నెంచరే. ప్రాణములనైనఁ బాసెదఁగాక నిందకోర్వఁజాల. దీర్ఘాలోచనమొనర్చిన నామతము మీకశ్రేష్ఠతమమనితోఁప కుండదు. బాధింపకుఁడు. మన్నింపుఁడు.

(అనుబంధము. 50.)

భర—(పాదుకలచేతఁబట్టి) అన్నా ! నీవుకాళ్లువదలించుకొనినపుడు దైవానుగ్రహమున నీపాదుకలు నాచేఁజిక్కె. ఇంతమాత్రమైన ననుగ్రహింపుము. నీవు పురికిరాకున్నను, నన్ను నీయెడ నుండనీకున్నను, నీమాఱుగా వీనినైన సింహాసనమున నుంచి యభిషేక మొనర్పనానతిమ్ము. (నమస్కరించును.)

వశి—రామా ! ఇది నిరుపాధికము. ఎవ్వరి ప్రతిజ్ఞలకును భంగమురాకుండునట్లును తనయభీష్టము నెఱవేఱునట్లును వేఁడినాఁడు.

కౌస—రామా ! నీయెడ భరతునకెంతభక్తియోచూచిన నేయెఱుఁగనగుఁగదా ? అట్టిభక్తిపరుని యభీష్టము నెఱవేర్పుము.

(అనుబంధము. 51.)

రామ—(భరతునాలింగనముచేసి) ప్రియావరజా ! నీకోరికకంటె నాకొనర్పఁదగినదేమున్నది ? తల్లులారా ! మీయానతి మీఱుదునా ?

భర—ఆహా ! లలనీకృతప్రస్తరనిజక్షోదములే ! రిపుశిరస్సంఛేదములే ! క్షోణీభరణమర్యాదములే ! అవ్యయమార్గప్రసాదములే ! కమలినీకృతవివాదములే, అపగతలోకనిర్వాదములే ! ఉజ్ఝితవిషాదములే ! లతాంతామోదములే ! విలగ్నశ్రీకుచస్వేదములే ! ప్రక్షాళితభూసతీముఖమృగమదశాదములే ! అసురావళీగర్భనిర్భేదములే. ఆలంబితసహాంతవేదములే ! ఈపాదములు-భళిరే, తమోహరణ తరుణారుణకిరణములు సర్వలోకభారభరణములు, శ్రుతశిరోలంకరణములు భవసాగరతరణములు, సుధీజన

మహితాభరణములు, ఈచరణములు. ఇవినాకులభించెఁగా? నాకామోదమునించెగా? మనఃఖేదముహరించెఁగా? నాసుకృతముమించెఁగా? నాయభీష్టముఁ జెల్లించెఁగా? సంయమీంద్రా! నీవిడినలగ్నమున రామునకరణ్యవాసము లభించెనని యయోధ్యలోని మందబుద్ధులనిరిగదా? ఆలగ్నముననే మాతల్లిచేఁగావింపఁబడి రామునకు నిష్కారణచే పాదుకలొసంగఁబడెనో వానికే పట్టాభిషేకముగలిగెనే. ఆహా? యెట్టిలగ్నబలము! రామచంద్రా! ఆపాదూరగునట్టియు, నీవరణ్యమునకేగిన జ్ఞాపకమును, దశరథుఁడు కాలధర్మమునొందిన జ్ఞాపకమునుఁ దెచ్చునట్టియు, నయోధ్యనేనుండఁజాల. నీపునర్దర్శనమవుటవఱకు దానింగన్నెత్తియయినఁజూడను. నందిగ్రామముననేయుండెదను. రామా! నాకుసెలవిమ్ము. ఇదె యీపదునాలుగువర్షములెట్లయినఁగడపెదను. పదునాల్గేండ్లును పదునాల్గుగడియలుగాఁగడచన నభిలషించు నాకు నీవియోగకారణమునఁజేసి పదునాల్గుగడియలే పదునాల్గువత్సరములుగాఁ దోఁపఁగలవు. అయినఁగడపెద. ఎట్లోగడపెద, ఆంగీరససంవత్సర చైత్ర శు॥ ౭-కి పదునాల్గు హాయనములు నిండఁగలవుగదా? ఆనాఁడు నీమంగళదర్శనము నాకుఁ గలుగకుండిన మనఁజాల-నిక్కముగా మనఁజాల. తల్లులారా! ఇందుండుకోలఁది వియోగము వలని దాహమగ్గలమయ్యెడు.

(అనుబంధము 52.)

(అనుబంధము 53.)

కైక—భరతా! జాబుమఱచితివే.

భర—అన్నా! శత్రుఘ్నుఁడు కుత్తుకఁ ద్రొక్క ప్రాణమాత్రావశిష్టయై యాఱుదినములుండి మంథరమృతిఁ బొందెనని యెఱిఁగితివికదా? అది మరణపువేళ నీపత్రిక వ్రాయించినది. నీకిమ్మన్నది—

రామ—(చదివి) భరతా! ఎంత సకరుణముగా వ్రాసియున్నది! మంథరా! నన్ను క్షమింపవేఁడవలయునా? నాకేమపకారమొనర్చితివి? నిక్కముగా క్షమించితి.

భర—అన్నా! మఱియొక విజ్ఞాపనము-ఈపాదుకలకుఁ బట్టాభిషేక మీయెడ యొనర్పవలయునని యభిలాషము. అయోధ్యకుఁ బోవనుగదా? ఇఁకనంది గ్రామముననైననేమి? ఇంకెైననేమి? నీసాన్నిధ్యమున నేయొనర్చుట భాగ్యమగుఁగదా?

రామ—తమ్ముఁడా! నీకెట్లభీష్టమో యట్లనే కానిమ్ము.

భరతుఁడు—(పట్టాభిషేకమొనర్చును.)

(అనుబంధము 54.)

పంచమాంకము.

శ్రీ పాదుకాపట్టాభిషేకము.

సమాప్తము.

# (అనుబంధము. Appendix.)

పుటసంఖ్య.

5. దశరథుడుఁ—రాగము-శంకరాభరణము-ఆదితాళము.

ఇంతఘోరవిధానమాయెనే. ॥ పల్లవి ॥

ఇంతయైనఁజూడకీధరాసురుని-నంతమొందఁజేసి నాఁడనయ్యయో ॥

పెల్లుశోకమునఁబెంపుదక్కి- వీని-తల్లిదండ్రులెంత-తాపమొందుచు -

తల్లడిల్లువారో-తాళఁజాలనే-నొల్లనొల్లవారి-కోపఁజెప్పదీని

6. దశరథుఁడు—రాగము , తాళము

పావన-మౌనిపుంగవమా-ఓ-

కాపకుమా-యోడకుమా-చూడకుమా-బ్రోవకుమా. ॥పల్లవి॥

ఓపిననిర్దయునీదు-పాపనిజంపిన

పాపమునకునాకు-శాపమొసగరాదే ॥ ౧ ॥

7. రాగము-శ్రీరాగము-తాళము-రూపకము.

అమరావన-విమలానత-కమలాసన-మారమణ. ॥ పల్లవి ॥

సమదాసుర-దమనానీకు-నమస్కృతులు-పీతాంబర ॥ అను ॥

ఘనాగమను-తనామనిను-వినాదైవమెఱుఁగ-

అనపాయ పదముగోరుచు-సనకాదినుతా-వినతా

వనశీలా-నినుఁగొల్చితి. ॥ ౧ ॥

అపారఘన-కృపాకలిత-సుపావనారిపుహారా-

విపాకముల నెడలించుచు-నపరాధపరుఁ విపులా

ధిషనన్నుఁ-గృపజూడవె. ॥ ౨ ॥

ఘటసంఖ్య.

7. రీ-మనిపమరిమపా-పమరిసరిగరీ-గరిసనిసరి-
సారిమ-రీమప-మాపని-రీ-మా-పా-నీ-
సానిప-నీపమపామరి-మారిస-రీగరి-గరిసని-
నా-మనవినివినవే-ననుదయఁగనవే-యనవరతము-
తిన్నని-చిన్నప-మెన్నుచు-లో-కా-ధా-రా-
కారణ-వైరిని-కారణ-వారణ-తారణ-శుభకర.

రాగం-మోహన-తాళం-రూపకం.

ఘనవేణీ-యుజురాణీ-వనరుహకిసలయపాణీ-
ననుదయఁజూడుపురాణి-కనికరమునవాణీ-
అనుదిననతగీర్వాణీ-కనదనుచరదింద్రాణీ-
వినతాశ్రిత-జనతాపహ-సునయునవిజితైణీ
జననుత దైవతమాణీ-ఘనకల్యాణి.

8. రామ—రాగము తాళము.

రావలదే తమ్ములిటకును
భూవరనుత-ధీవిదిత. ॥ పల్లవి ॥

చిన్నితమ్ములిందురాక-చేయ నేటికి-
కన్నతండ్రివేఁడువాఁడ-నున్నతివలదెన్నఁడైన. ॥ ౧ ॥

9. దళ—రాగము తాళము.

తనుజాతా-యేలుమా
భూతలమంతయు-ఁబ్రీతిజనింప
వారకనీకిటు-పట్టముగట్టిన
ధారుణినాధగు-భారము దీఱు॥

పుటసంఖ్య.

13. కైక—రాగము తాళము.

హాహా యిదియెంతపాప-మహాహా. ॥ పల్లవి ॥
ఇంతటిమాటల-నెటులాడఁజాలితే
సంతాపమెంత దురంతమాయె.

15. కైక—రాగము తాళము.

మంథరా-నన్నిటుకావవే-యో ॥ పల్లవి ॥
మునిఁగితివనధిని-ననుదరిఁజేర్పవే
కనికరంబునను-ఁగాపాడవెయో. ॥ ౧ ॥

17. దశ—రాగము తాళము.

వింతలాయె-కామినిఁజూడఁగ-వింతలాయె
ఇంతిరో-నీవిటువంతలఁజెందుట-వింత॥
నారీమణి నీచందముచూచిన వింతలాయె
భూరివిచారమొ-కోరికెరీతియొ-కూర్మివెలార్చుట-వింత ॥

18. కైక—రాగము-నీలాంబరి-తాళము-ఆట.

మోసపోయితినయ్యో-నాథునినమ్మి ॥
ప్రాణనాథుఁడునన్ను-ఁబ్రాణపదముగాఁగ
దానెంచునని మది-నేనమ్మియుంటిని ॥ ౧ ॥

21. దశ—రాగము తాళము.

కోరకుమాసరసీరుహవదనా ॥
మానినియీక్రూరభంగిమానుదీనుపై
ఓ-చానసూనుఁగానఁదోలు-టీనెఱితగునే ॥

పుటసంఖ్య.

23. దశ—రాగము. తాళము.

చెలియీపాటు సైరింపనే
హా-నాపుత్రు నాకీయవే || పల్లవి ||

(నాపట్టినేఁబంపనే.)

నీ-కేలంటి కాలంటినే-నీలాగు వేఁడంగనీ
జాలమేలతాళఁజాల బాళిలీలబాలా

23. రామ—రాగము కానడ. తాళము ఆట.

చూడవేల-మాటాడవేల |
నేఁడిదేటికీ-శోకములీల ||—

(తండ్రినీ-వాఁడనుగానా.)

నామీదకోపమొ-ప్రేమముచూపవు ||
రామాయనిపిల్వ-వేమపరాధమొ ||—

24. రామ—రాగము-తాళము.

జనకా నీకిటులేటికి-నను తాపము జనియించెనొ |
మనసారగ నాకార్యము-వినుపింపఁగదే ||
మించినతమ్మినే-భూతల-సంచారము మొదలేమది |
నెంచితి దానికి నిటుశో-కించఁగనేలా || || ౧ ||
నాసోదరుఁ డతికరుణా-భాసురుండౌ భరతుఁడు |
నీ సూనుఁడు రాజగుటకుఁ-గాసిలవలెనా || || ౨ ||
ఎడరేయిది కైకేయియుఁ గడుగూరిమి గలతల్లియె |
అడుగఁగ రాదేవరముల-నడలఁగనేలా || || 3 ||
నీకై యనలముఁ జొచ్చెద-నీకొడుకను నీదాసుఁడ |
నాకానకుఁ బోఁజాలనె-శోకమిఁకేలా || || ౪ ||
గాసిల్లకు మదేవచ్చెదఁ గౌసల్యకు వివరించెద |
నాసీతకుఁ జెప్పెదనా-యాసముపలదు || || ౫ ||

పుటసంఖ్య.

25. కాస—రాగము. తాళము.

ఈవిధమునకే మిసేయుదు.

ఇం కెందుబోవుదు.——

బాలమన్మథనిన్నుఁ గానల- పాలుచేసిశోకమే
లీలనీగుదు ప్రాణసమితి- తాళుదానసే। ॥ ౧ ॥
కైకగర్భమునందుపుట్టక-నాకుఁగల్గినందున
భీకరాటవులకుఁబోయి- తేకుమారక ॥ ౨ ॥

26. రామ—రాగము. తాళము.

ఇటువేకారినీకేల శోకింపఁగాఁదల్లిరో
సుశ్లోకవు నీవెందును-చాలు. ॥ పల్ల ॥

నీమాటపైనమ్మరో- నే-నీమాడ్కి-నిందుండిన
భూమిధవు- నేమనము- దేమగుస-తీమణిరో. యీ మాట
లాడకు మోమాత॥ ॥ ౧ ॥

28. సీత—రాగము. తాళము.

అపరాధమేమినాథా-నాయెడ-నప ॥పల్లవి॥
తపియించి కుందురీతిగాఁ గృపమాన వేమినేఁ జేసితి॥
ననునీవు బాసిపోవఁ మనియుందు నంచునెంచితే
వనభూమి నీవు చేరఁగా-మనసారవీట నేనుందునె ॥ ౧ ॥

28. రామ—రాగము. తాళము.

భామాచన-దీమానసము ॥పల్లవి॥
ప్రేమాయతినీమాటల- నేమాడెదవో మానిని ॥అను॥
బాలామణి హేలాసుఖ లీలావతి వాలాయము।
చాలావెతఁదూలంగనిఁ-కేలామణి యీలాగున ॥ ౧ ॥

పుటసంఖ్య.

29. సీత—రాగము. తాళము.

పాదములాన-నీ-పాదములాన ।
కాదనకీ-శోకసాగర-మీఁదఁగజాల ॥ ॥ పల్లవి॥
భూపతిలక మేనఁబ్రాణ-మోపదుండఁగా।
నాపయినీబాలఁజంపు-పాపమురాదా॥ ॥ ౧ ॥

30. కైక—రాగము-తాళము.

భూపాలుఁడేమైపోవునో ॥పల్లవి॥
పరి-తాపముగలిగె అను॥
ఎంతనిచెప్పుదు-సంతాపవైఖరి.
అంతముగానని-చింతలరమణీ ॥ ॥౧॥

32. కౌస—రాగము-కానడ. తాళము-ఏక.

కటకటకాంత—యెటువలెనింత ।
పటుతరచింత—పడియెదోవింత ॥
నీకైక పట్టికి-నీరాజ్యమిమ్మఁకనాకూర్మిసూనుని నాకిచ్చి
కావుమా ॥౧॥

32. రాగము. తాళము.

సుమిత్ర—నీరాముఁడెంతటి-నేరము జేసెను ।
ఘోరాటవులను-జేరంగనాథ ॥ ॥౧॥

కౌసల్య } వైరులకైనను వలవదీ దుఃఖము ।
సుమిత్ర } ఎరీతిఁ దీర్చెద-వో రాజ శేఖర ॥ ॥౨॥

33. దశ—రాగము-కేదార-తాళము-రూపకము.

నీరజముఖులారా-వర ॥ ॥ పల్లవి ॥
నేరమించుకైన నేనెఱుంగనిజ-మీరక్కసిసాధించెను
కోరిభూరివైరము ॥

పుటసంఖ్య.

33. దశ—

కనికరమింతై ననుగనకీ-వనితవరఁములనియుడిగెను

ఘనమగుపరితాపమడరెను-మనజాల-గద-మనసులననుఁ.

గనలకుడిఁక || ౧ ||

35. కౌస—రాగము తాళము.

వర-తమాలవేణిరో వాదా-నా

కుమారుఁదయఁగనరదా || పల్లవి ||

బాలా-వైరములేలా-కోపముమేలా-ననుదయజూడుమిఁకఁ

జాలా-బాలుని-వెలార్చకు-హేలాగుణ-చాలా || వర ||

35. కౌస. దశ. } రాగము-సురటి-తాళము-ఆది.

ననుఁదలచిదయఁజూడవే-సతీ-

కొనకిదేలాయింత-కోపముబూనఁగ || పల్లవి ||

కైక—ఇదితగునెకడునాఁటిడి-భళీ-

మదినినామాటింక-మానఁగజాలనే || పల్లవి ||

కౌస—బాలా-వైర-మేల-నేర-మేమీ-పరమా-దరణ-విడఁగ || ౧ ||

కైక—మేలీ-మాట-నాదే-నేర-మాయె-మొలఁతా-వలదీపలుకు ||

దశ— ఈరీతి-మేరాచ-కోరాకీ-వైరము-ఇరవారఁగరుణింపు-

భధమాయె-తాళ— || ౨ ||

కైక—ఇంతేల-నామీదఁబంతంబు-జూవఁగ-

నెడఁబాయు-టెడరానె-మిదుకంగనిటు || ౨

కౌస—నన్నుతాంగి-విన్నవించు-చున్నదాన-నన్నుఁద్రోయు-సరసము

తగునే-సురుచిరగతినీ-కరుణవదలకే-నిరతము || 3 ||

కైక—మాటిమాటి-కాటలానే-పాటిరాని-మాటలేల-మగువరోయి

దియుం-బగయునఁదగునే-సొగవులవగలే-తగదిఁక || 3 ||

దశ—నా-మనవివినవే-కినుకవలదే-వనజనయనా-మనసుననుఁగొనకొని

యిఁకనే-మనఁదలఁచిననీ-పనివిడువఁగదే-పణతిరో || ౪ ||

పుటసంఖ్య.

కైక—నా-కకటచను నే-వెకలిమనపుల్-వికటమతి నే-సుకరముగవిక-
లములగునా-టకరచనలనిం-దకుగుణిగొలుపక్-బ్రకటము ||౪||

కౌస—సరసిజముఖినీ-భరతునినిపుడే-ధరణినిలుపుమె-వ్వరువలదనరీ-
చరితము-శుభకర-మతిసుఖ - కరమగు-నిరతము-మదిమదిఁ-
గనుఁగొని-యెదమిఁక - నరాళ-శిరోజ-కుమారు-నరణ్యా-నివా
స-విరోధ-మేల ||౫||

దశ — విలసినమతివై -వెలసినసతికీ-తులువతనమునీ-కలవడఁదగు నే-
చెలియరో-నిజముగ-మననిఁక-బలుదయ-విలసిల-ననునిటు-బ్ర
దుకఁగఁ-బనుపుము. పలాశి-విచార-మిదేల-విలోల-విలోచ-
నలాతి-నటె ||౫||

కైక—కొడుకునకని నే-నడిగినవరముల్-దుడుకుతనముగా - నుడివెదర
కటా-కొడుకును-గొనియెదె-యడవులఁ-బడియెద-కడుముద-
మడరఁగ-ఁగడుకొని-మనుఁడిఁక - నెడంద-ఁగడింది-వెడంగు-
కడంగి-యడంచు-టిదేల-యిటు ||౬||

35. సుమి—రాగము తాళము.

సరసిజలోచనచూడవే। తరమగు నే
భీ-కరమగుచందము। ||పల్లవి||
శ్రీకరుండగు-రాకుమారుని
భీకరాటవిఁ జేర్చకుమా
వీఁకచెడుబలు-కాకతగదిది-కైకనీకును-గరుణయుఁగలుగదే||౧||

35. రాగము తాళము.

సుందరాంగి-కైకేయీనీ-కెందుకేయీ-క్రూరభంగి-డెందమునఁ
గరుణలేక-మందయాన-మమ్ము నెల్లఁగుందఁజేయు-టేటికమ్మ ||
కానలోన-దశరథ- సూనుఁడుండ-ఁగోరితేనిమానవతి - నాకిద్ద
రు-గానవారి-లోననొకని-ఁబూన్చిపంపు-సోదరినీ- కెందుకే ||౨||

పుటసంఖ్య.

35. కౌస—రాగము తాళము.

కైకా-మానవెకాక-రామునిపోక-భరతుఁడువచ్చెడు-దాక-
చేకొను-మీకై వడి-పోకార్పకు-వీఁక-

36. కైక—రాగము-కేదార-తాళము-రూపకము.

పోలదె-మీమేలిపల్కు-లు-ఇంకేలాచాలును-
బాలఁగాఁనను-గోలఁగాఁగొని-గేలిచేయఁగఁజాలువారలె॥
వెలయఁగమీమాటలబలు-విన్నాణమునిండారెను.
తలపకుఁడీనన్ను మోసముసలుపుమాట సవతులార॥

36. లక్ష్మ—రాగము-దర్బారు-తాళము-రూపకము.

వింటిరేసదస్యులార-వెలఁదిమాటల
కంటగించియాడువాలు-గంటిచందము॥
క్రూరభంగినీమెమగని-ఁగోరెవరముల
తారతమ్యమరసికనుఁడు-ధర్మసూక్ష్మము॥

38. లక్ష్మ—రాగము-కేదారగౌళ-తాళము-ఆది.

కోపముచేఁగడు-పాపములాడితి-
భూపతిలకనాకు-శాపమొసంగవె.
తాళకతల్లినిఁ-దండ్రినిదూఱితి-
పోలదీపాపపు-నాలుకఁగోయవె॥

40. ఊర్మి—రాగము తాళము.

ఈవిధిజేసెద వేమిదినాథా-
కావవెకరుణను గైకొనిమనవిని-
ఎన్నఁడుదైవము-చెన్నుననమ్మి-
యున్నకులాంగన-మన్నింపకదే-
నన్నుబాసి-కడు-ఖిన్నఁజేసి-చన
వన్నెవాసిరా-నున్నదెఁప్రాణనాయకా-

పుటసంఖ్య.

క్రూరమటంచన-కారయనిటునా
మారణవిధికినీ-మనసాడఁబడెనే-
ఘోరలీల-ఈవైరమేల-నే-మీఱఁజాల
నీభూరివియోగాంబుధి-హా-హా-

41. రాగము-దర్బార్-తాళము-రూపకం.

సీత —పంతమేలపూనెదమ్మ-వంతఁగుందగా-
ఇంతయైననాకుఁదోఁచ-దింకచెల్లెలా-

ఊర్మి —ఏలతోఁచునమ్మనీకు-నిట్టిశోకము-
చాలనీదుకార్యమాయెఁ-జాలునేటికి-

సీత— ఎంతతప్పఁదలచితమ్మ-యిట్టులాడగా-
సంతసంబెనినుఁబాసి-చనగనాకును-

ఊర్మి— ఈవిధంబెయైననేను-పోవుదాననను-
ఏవిచారమేలయిందు-నీవెయుండుమా-

42. ఊర్మి—రాగము-శంకరాభరణము తాళము.

ప్రాణేశనీకుశుభము
మానితముగఁ గోరుదాన ॥ పల్లవి ॥

అందమౌరనెల్లగిరుల యందుభూరివనులయందు।
నెందుఁగానినీవుశుభము లొందుచుండువాఁడవింక ॥ ౧ ॥
నగములైననెల్లవనుల—మృగములైన భూరితరము ।
ఖగములైన సారరీతి-జగతినీకు సౌఖ్యమిచ్చు ॥ ॥ ౨ ॥

46. రాగము-భూపాళం-తాళం-ఆట.

రామ
లక్ష్మ
సీత } చాలా-మీరలడలవలవదీవేళ.
ఈలోన నేమరలివచ్చెదము వేగమెయింకేలా ॥ పల్లవి

ఫుటసంఖ్య.

దశ } బాలా-తాపమెటులఁదాళుదుమీవేళ
కౌస } నీలాగాయె-మానోముఫలము-చూడఁగనింకేలా ॥ పల్లవి ॥
సుమి }

రామ—కళవళింపకుఁడింకమాకయి [ముగ
బలముగాఁదలిదండ్రులా రా-తలపరే-పనుపరే- పలుకరే - సేమ

సీత— సతులోనర్చెదమధికభక్తినిఁ-బితరులార-శుభంబుగోరుచు-
వెతలఁబో-విడిచిమ-మ్మనుపరేసౌఖ్యముగ ॥౧॥

లక్ష్మ— సేమనంబిడుఁడింకసీతా-రాములవెనువెంటఁబోయెద-
ప్రేమతో-సేమమే-కోరుఁడీ-పంపుఁడిఁక ॥౨॥

సుమి— రామనీదుహిమాంశుఁబోలిన-మోముఁజూడఁగమరలఁగలేదు-
సేమమింపారఁగా-లీలమైఁ-బోయిరమ్మ ॥3॥

కౌస— అడవులనుఁబాలించినాదగు-కొడుకుఁ-గోడలిమరలనాకె-
ట్లిడియెదో-బాలకా-లక్ష్మణా-సేమముగ ॥౪॥

దశ—పాడియెటుఁగకనిన్నునీపతి-తోడఁగానలకంపుటదియే-
జాడయో-కోడలా-చేడెరో-చూడకిఁక ॥౫॥

**47.** పౌరులు—రాగము. తాళము.

దిట్టతనంబునవెడలండి-గట్టిగధైర్యముపట్టండి
పొట్టలుడొక్కలుచీల్చండి-కట్టెలగంపలఁగాల్చండి
రామునిఁ, కానలలోఁజేర్చి-తామసించిరిటుపోకార్చి.
మోమోటంబడివిడువండి-ఆముండలవడిపొడువండి ॥౧॥

కైకరాజసతియగునేమి-కాకామంథరముండేమి
లేకున్ననుదశరథుఁడేమి-పోకుండఁగఁబడిమొత్తండి ॥౨॥

ఒడ్డనమేర్పడనిలుపండి-కడ్డాయంబుగఁబిలువండి
అడ్డమువచ్చినవారలను-గొడ్డంటనుఁబడఁగొట్టండి ॥3॥

పుటసంఖ్య.

48. రామ—రాగము. తాళము.

పౌరులార వేఁడువాఁడ-భూరికరుణఁజూడుఁడీ
ఘోరపాపకార్యమాయె-ధీరులార వీడుఁడీ
భూతలేశుభార్యమీకు-మాతగాదొ యెంచఁగా
భీతిలేక చేయువారె-మాతృహింస మెంచగా ||౧||

48. దశ—రాగము తాళము.

రాఁగదే నన్నుఁజేర-రథముమాని రాఘవా ||పల్లవి||
ఈసుమంత్రుఁడిట్టురథము-నీసు చేసితోలెఁగా
భాసురాంగు నన్నుఁబాపఁ జేసిపాపియయ్యెనే
ప్రేమమీఱ నరదమింత-తామసింపనిల్పుచు
నేమహాత్ముఁడైన మా-రాముమాకునివ్వరే

50. కైక—రాగము-పీలు-తాళము-ఆది.

ఎంతద్రోహపుకార్యమొనర్చితి
వంతలెంతో-వచ్చునాకును-
భూపాలునిమది-కాపగదాయనై-రూపుమాపితిఁ [యె.
దోఁపదాయెనొకింతయుఁ-దోఁపదాయె-నేపువోయె-పాపమా

57. దశ—రాగము-సావేరి-తాళము-ఆది.

నేనేమితప్పుచేసితినో-రామా-
దీనరక్షక నన్నుఁదిలకింపరావే ||పల్లవి||

ప్రేమచూపవు నాపై-నేమినేఁజేసితి-రామాయాలింపవే-నామ
నవి-ఈమరణము వేళ-నేనిఁజూపవె నాకు-నీముద్దుగాలునె-
మ్మోముకుమార ||౧||

57. రాగము-ముఖారి-తాళము-ఆది.

కౌస } వెడలితే ప్రాణేశా-హాహా
కైక } కడుదయ-మానితేమాపై

పుటసంఖ్య.

కౌస——చట్టులతసూనుని-నటువులకంచి-
పటుతరశోకముపాలై-కటకటమమ్మ బాసితే ॥ ౧ ॥

సుమి—— మోహమునించుచు-ముద్దులసతియని-
యీహజెలంగవు వింతాయె-ద్రోహమదేమినాథా ॥ ౨ ॥

58. కైక——రాగము తాళము.

జనలోకపాలా-ననుఁబాసితే-
దీనతవాటిల-నానేరమెంచుచు-
పోనాడనీదయ-హానాథపోయితే- ॥౧॥
వరములడుగనీకఁ-గరుణించిచూడుమా-
భరతునిమానియీ-పరిరావు నిల్పుమా ॥౨॥

58. రాగము ముప్పరు తాళము.

కావవె-కావవె-కావవె.
హా-ప్రాణేశబాసితెమమ్మ-దయ-లేనిచందముదోఁచెను
మ్మ-కరుణానిధిమనవిఁజేకొమ్మ-యీప్రాణమెయింకభా
రమ్మ-నీవు-లేనిదెమనమింతనమ్మ॥——
(రెండవయువనికపడును.)
మ-మ్మారయకనడలఁజేసి-నేఁడూరకెమమునెడఁబాసి-
పోవ-వైరులమేగుణరాశి-కడఁ-జేరెనెమాబలువాసి-
మను-వారమెనినుఁదలపోసి॥ ॥౧॥

(ముందుయువనికపడును.)

59. భర——రాగము-తోడి-తాళము.

పురిదాఁపున-కరుదేరగఁ-బరికింపవె-యరిసూదన-
పరితాపము-భరియించుట-యరుదాయెఁగదే-
చేతోభయ-మీతెలుఁగున-నీతాపము-నోతమ్ముఁడ-
ఆతల్లుల-కాతండ్రికి-నేతెలుఁగదే-

[illegible]

63. [illegible]—రాగము [illegible] తాళము.

అయయోయిఁకేగతి–వియోగతాపము తాళఁజాలవనజాక్షి ॥పల్ల॥

పాపబుద్ధినీపునన్నుఁబాడుచేసితి.

భూపమౌళితోడనేను–ఁబోవఁజాలనైతినే–యయో ॥౧॥

64. శత్రు—రాగము-హిందూస్తాని-తోడి-తాళము.

తామసమాయెనేమనియింక–రామునిఁజూచువాఁడనో–

య్యాతరినింకభూతనుజాత–సీతనుగాంచఁగూడునె–

మాతయెయింతపాతకియాయె–ప్రీతిదలంగదైవమా॥

65. భర—రాగము-సావేరి-తాళము-రూపకము.

మనఁగలనే–ఆహా–

ఆ–మనుజాధిపు రాముఁజూడక ॥మన॥

వనభూమికిఁదనుఁబంపిన–ఘనపాపినికాకైకకు–

జనియించితినని రాముఁడు–నను నేఁడరగంటఁజూచిన ॥౧॥

67. కౌస-రాగము-ఆభోగి-తాళము-ఆది.

హాహాయిఁకనేదిదారి॥

ధరణీశరామునీ పురిఁబాయఁజేసియు

భరతునినైనన్ను–బరికింపవైతివే॥ ॥౧॥

ఆకైకకోరికఁ–జేకొంచురాముని–

లోకాభిరాముని–నాకానఁజేర్చితే॥ ॥౨॥

67. భర—రాగము తాళము.

వీర–మాతా–దయఁజూడకే.

చింతింపకమ్మనా–యంతముఁజేయుమీ–

ఇంతయైనఁగీడులేదు–సంతసింతునే ॥౧॥

69. కౌస—రాగము తాళము.

అన్నరోతాపంబుచేసీ–పిన్నమాటలాడితి।

పిన్నమాటలాడితి॥

పుటసంఖ్య.

నిన్ను వేఁడే-రాము వేఁతె-యెన్ను దానఁ గోను-
ఎన్నకయీమాటలెల్ల-మన్ననంబుచేయవే ‖౧‖
పెల్లుగామాప్రాప్తికినీ-తల్లియేమిచేసెను।
చెల్లఁబోయా కైక నేలా-చెడ్డమాటలాడెదు ‖౨‖

70. కైక——రాగము తాళము.

ఘోరపాతికినే-సారసాక్షిరో-చంపుమునను
క్రూరవరము-గోరిచంపితి-ధారుణీ-పాలుని ‖పల్ల‖
భీతిఁగానక-నీతనూజువ-నీతలంబను-నూతఁద్రోసితి-
మాత నేఁబలి-ఘాతుకిననుఁ-బ్రీతిఁజూడకుము ‖౧‖

72. లక్ష్మ——రాగము తాళము.

పనిఁబంపునన్ను-నింపుమీఱ-సొంపునింపెద-
నను-కంపమాని-ఱొంపినింపి-చింపిచంపెద.
అదె-వైరిదారిమేఱమీఱి-చేరఁదేరఁగా-
ముద-మారఁజేరి-చీఱికేరి-కోరిపోరెద‖

73. రామ——రాగము-తాళము.

మేలా ఘనిట్టిమాటలీ-వేలీలనాడితి
చాలా యెఁజూచిచూచినీ-కేలాగుగల్గెనో
నాకూర్మిసోదరుండవై-యీకీడులేటికి-
నీకేమికావరంబొకో-క్షాకవివేకమో ‖

74. రామలక్ష్మ——రాగము తాళము.

మనగలమేయిఁక-జనకా ‖ పల్లవి ‖ నినుఁగనక ‖ అ‖ ప‖

రాము——సేమము జింతించుచు నా మోదము కన్నీరునఁ-
బ్రేమముదై వారఁగ రామా-యనుచుంటివె ‖౧‖

పుటసంఖ్య.

లక్ష్మ—కోపముదగదని-తీపారఁగబోధించితి
పాపముఁబాపిననుఁ గోపాదవెచూడవె- ||౨||

సీత—వీడకనాముద్దుల-కోడలనిమన్నించితి.
చూడకననోన్నృప-చూడామణిపోయితె ||3||

75. కైక—రాగము-యదుకులకాంభోజి-తాళము.

రామారిపు-భీమాననుఁ-బ్రేమఁజూడుమా
యీమాటల-నేమాడెద-వామన్ననయేమాయెను ||పల్ల||

నోనాడుచు-గానవము-లోనఁద్రోసిన
హీనయనిపోరాడకు-న్నానేరములోనెంచకు ||౧||

76. భర—రాగము-బేహాగ్-తావము.

ఇదితగునె-రామా-ఇది.
నీ-పదదాసునిఁ బారఁద్రోలుట.
వినుకేటికినీకేతగు-నసియాడుమసముమానుము.
పసిబాలుఁడ నవివేకుఁడ-వసుధాతలమేలఁజాల ||౧||

76. రామ—రాగము-ధన్యాసి-తాళము-రూపకం.

జనకాజ్ఞమీఱనాకుఁ
జనునేకుమారక-
వనభూమిమానినే-జనుదేరఁగాననుఁ-
ఘనరాజ్యకాముఁడంచు-జనులెల్లఁదిట్టరే.
మనసుననునుఁ గనలకుమిఁక ||౧||

76. కౌస-కైక-సుమి—రాగము-కానడ-తాళము.

కౌస—పరికించితె-కుమారక-భరతునిభక్తిని-
కరుణించిచేయుమీతని-యురుధార్మికకోరిక ||౧||

పుటసంఖ్య.

సుమి—ఘనాశమీఱఁజేసెనీ, మనోభిలాషము-
విన్నగఁబోలుదీనినో-తనూజసేయవే ||౨||

కైక—కూరిమిపిన్నతమ్ముఁడు-కోరినకోరిక-
దూరంబుసేయఁ-బాడియే-శ్రీరామచూడవే ||3||

77. కౌస-కైక-సుమిత్ర-భరత-శత్రుఘ్న. రాగము-కాఫీ-తాళము-ఆది.

(కౌస-కైక-సుమిత్ర-భరత-శత్రుఘ్న.)

ఊరికినిబోవమనసేరీతిగ-నూఱడిలు
సారెకునునీరాకయె-కోరుచుందు-మోరఘువ ||

కౌస—పున్నమచందురుని-నున్నతిఁగాంచుగతి-ఁజెన్నారఁగ
నిన్నుఁగను-టన్నాయిఁకనె-న్నాళ్లకో ||౧||

భర—సోదరనిన్నుంగను-మోదములేకయున్న-సాదరవి-నోదా
యిఁక-భేదమును-నేఁడాళను ||౨||

సుమి—బాలకమేమీపదు-నాలుగువత్సరము-లేలాగునఁదా
ళుదుమొ-శీలాగుణజాలాయిఁక ||3||

కైక—శ్రీకరకాపాడవె-చేకొనిమన్నింపవె-యీకానల-నీకీగతిఁ-
జేకూర్చిన-కైకేయిని ||౪||

శత్రు—ప్రేమన్నునిన్నుంగన-కీమెయి నేనుండఁగ-నామానసమే
మానాక్కో-యేమారదు-రామానిను ||౫||

77. రామ-లక్ష్మ-సీత.రాగము-వరాళి-తాళము-చాపు;

చింతింపఁగా-నిం తెలతల్లులారా-
వంతలన్నియుమాని-సంతోషమునఁబోరె ||పల్ల||
ఏలయోచనచేయ-నీలాగు ? కడచను-
నీలోననీపదు-నాలుగువత్సరములు ||౧||
భరత ! నాసోదరా ! పరితాపమేటికి-
ద్వారలోనెమేమూరి-కరుదెంచువారము ||౨||

— మంగళము —

పుటసంఖ్య.

77. రాగము-సురటి-తాళము-రూపక.

శ్రీ-రా--మానాథా-భూరి-ధరాధారవినుత (శీలా)
మంగళం ||పల్లవి||

వందనీయమునిమనోర-విందసారఖేలనా-
బృం-దా-ర-క-పా-లా-
సుంద-రార-వింద-లోచ-నా
నందిత-నందసు-నందన
వనరుహ-భవశశి-ధరసుర
వరనుత-వటదళ-సుశయన ||౧||

రామకృష్ణసుకవివినుత-సామవేద-గోచరా.
సా-మ-జే-శ-పో-షా-భూమి-జాత-కామి-తప్రదా
భామిత-ధీమహి-మామిత-పురహర-సురవర-సుఖ-
కర-మురహర-ఖరకర-సునయన ||౨||

సమాప్తము.



S. MURTHY & CO., THE "KAPALEE" PRESS, MADRAS.



# By the Same Author

**IN THE PRESS**

Prahlada, Chandrahasa, Pramela.

## Ready for Sale.

---

Chitra Naliyam,

Vishada Sarangadhara, Savitri.

*For Copies apply to:—*

RAMA VILAS PRESS,

Bellary.